# సాహిత్యోపన్యాసములు

## 17

ఉన్నవ లక్ష్మీనారాయణ శత జయంత్యుత్సవ
సందర్భమున జరిగిన ఉపన్యాస సంకలనము






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు.

**SAHITYOPANYASAMULU - 17**

Speeches delivered by **Sri Guduru Namassivaya** and **Dr. S. Gangappa** on the occasion of the centenary celebration of **Unnava Lakshminarayana.**

---

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు - 500 004

ప్రచురణ : 304

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1980
ప్రతులు : 1000

వెల : రూ. 1-75

ప్రతులకు :
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్ - 500 004

ముద్రణ :
కుమార్ ప్రింటింగ్ ప్రెస్,
హైదరాబాద్

---

Paper used for Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలి పలుకు

సమకాలిక సాంఘిక సమస్యలను ప్రతీకాత్మకంగా తాత్త్వికంగా సందర్శించిన సాహిత్య కళాతపస్విగా, నవలాప్రక్రియకు కొత్తమలుపు కల్పించిన ప్రయోగశీలిగా, మానవోత్తముడుగా, మేధావిగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా తెలుగుదేశం రాజకీయ, సాంఘిక, వాఙ్మయ రంగాలను ప్రభావితం చేసిన ఉన్నవ లక్ష్మీనారాయణగారి శతజయంతి ఉత్సవాలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ గుంటూరులో నాగార్జున విశ్వవిద్యాలయంవారి సహకారంతో నిర్వహించింది.

10-4-1980 గురువారంనాడు జరిగిన ఈ ఉత్సవ సమావేశానికి నాగార్జున విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య భావరాజు సర్వేశ్వరరావు గారు అధ్యక్షత వహించినారు. ఆ సభలో "ఉన్నవ జీవిత విశేషా"లనుగూర్చి శ్రీ గూడూరు నమశ్శివాయగారు, "ఉన్నవ సాహిత్య జీవిత విశేషా"లను గూర్చి నాగార్జున విశ్వవిద్యాలయం ఆంధ్రోపన్యాసకులు డా॥ ఎస్. గంగప్ప గారు ప్రసంగించినారు. అకాడమీ కార్యవర్గసభ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారి పర్యవేక్షణలో ఈ సభ జయప్రదంగా జరిగింది

శ్రీ గూడూరు నమశ్శివాయ, డా॥ ఎస్. గంగప్ప గారల ప్రసంగాలను ఈ పుస్తక రూపంలో అందిస్తున్నాము. ఈ వక్తలకు మా కృతజ్ఞతలు.

హైదరాబాదు,
1-8-1980

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి

# జీవిత విశేషాలు

శ్రీ గూడూరి నమశ్శివాయ

శ్రీ జనాభ్యుదయానికై అచంచల దీక్షతో తన జీవితకాలమంతా కృషిచేసిన సంఘ సంస్కర్తగా, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమ నిర్మాతలలో ఒకరుగా, గాంధీజీ అడుగుజాడలలో భారతజాతీయోద్యమం నిర్వహించిన స్వాతంత్ర్య సమరయోధుడుగా శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు తెలుగు జాతికి చిరస్మరణీయుడు. వ్యక్తిగా ఆయన సౌజన్య సౌహార్దములు మూర్తీభవించిన సంస్కృతిపరుడు. మితముగా స్మితపూర్వకముగా మాటలాడు మృదుభాషి. చేపట్టిన కార్యాన్ని మిన్ను విరిగి మీదపడినా పట్టుదలతో తుట్టతుదవరకూ నిర్వహించే కార్యదక్షుడు. పారతంత్ర్య శృంఖలాలలో మగ్గిపోతున్న జాతికి విముక్తిని ప్రసాదించిన స్వాతంత్ర్య సమర యజ్ఞంలో తానూ ఒక సమిధఐన త్యాగమయ శీలి. నిర్విరామ ప్రజాసేవతో నిస్స్వార్థ దేశసేవతో తెలుగుజాతిని మేల్కొల్పిన వైతాళికులలో ప్రథముడు లక్ష్మీనారాయణ పంతులుగారు.

తెలుగు దేశమంతా ఉన్నవవారి కార్యక్షేత్రమే అయినా జన్మమిచ్చిన స్థలము మాత్రం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోఉన్న వేములూరుపాడు గ్రామం. జననం 1877వ సంవత్సరం డిసెంబరు 6వ తేదీ. అనగా, (విక్రమనామ సం॥ కార్తీక బ. 30 మంగళవారం.)

తల్లి- శేషమ్మగారు, తండ్రి- శ్రీరాములుగారు. వీరు అచలయోగమను కుండలినీ నిత్యసాధకులు. ఆయనకు కులతత్వాలంటే గౌరవం లేదు. ఆ సంస్కారమే తరువాత కుమారునకు సంక్రమించి ఉత్తమ సంఘసంస్కర్తగా తీర్చిదిద్దాయి. పన్నెండు సంవత్సరాల వయస్సులోనే లక్ష్మీనారాయణగారికి ఉపనయన సంస్కారం జరిగింది. గాయత్రీ మంత్రంతోపాటు అచల సిద్ధాంతానికి సంబంధించిన "ఆకాశాత్పతితంతోయం-యథాగచ్ఛతి సాగరం" అని కూడా ఉపదేశించారుట. అప్పటికే భారతం బాగా చదివి వంటపట్టించుకొన్నారు ఆయన. ఆ పిదప ఆయనచేత అచల

బోధ గ్రంథాలలో పోకల శేషాచలనాయుడుగారి పరమపద మార్గము, తరిగొండ వెంగమాంబగారి రాజయోగసారము, భాగవతులవారి శుద్ధ నిర్గుణతత్త్వ కందార్థాలు తండ్రిగారు చదివించారు. కుండలినీ యోగసాధన చేయలేదుకాని అచల సిద్ధాంతాలు మాత్రం కొంతవరకు అవగతం చేసుకున్నారు. ఏ పేరుతోటీ పిలవకుండా మానసికంగా ధ్యానం చేసినా, ఏ భాషలోనయినా ఏ పేరుతోనైనా "అల్లా" అన్నా, "గాడ్" అన్నా, "పోలేరమ్మ" అన్నా, "కాళీ" అన్నా మన మనస్సు కొంతవరకు లగ్నమవుతుందని చిన్ననాడే గాయత్రీ మంత్రం ఉపదేశించినప్పుడే తండ్రి చేసిన బోధ తలలోకి ఎక్కింది. బిడ్డ అడక్కపోయినా పెంచేవాడు తనపై పక్క దిప్పుకొని మేలు చేయవలెగదా! దీనికితోడు విద్యార్థిగా ఉన్నప్పుడే రాజారామ్మోహనరాయలు, దయానంద సరస్వతి, అనీబిసెంట్ మొదలయినవారిని గురించి తెలుసుకున్నారు. అన్నీకలసి ఉన్నవారిని ఇంతవానిని చేసినవి.!!

లక్ష్మీనారాయణగారి ఉన్నత విద్యాభ్యాసమంతా గుంటూరులోనే జరిగింది. ఆయన ఏ. యి. యల్. యం. కళాశాలలో (ఇప్పటి ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో) 1897 లో మెట్రిక్యులేషను, తరువాత యఫ్. ఏ. క్లాసు వరకు చదివారు. తరువాత ర్యాలి కంపెనీలో ఒక సంవత్సరం క్యాషియర్‌గా ఉద్యోగం చేశారు. అనంతరం ఉద్యోగానికి స్వస్తిచెప్పి న్యాయవాది చదువుకు పూనుకున్నారు. 1903 నుంచీ గుంటూరులో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించడంతో ఆయన సంఘ సంస్కరణ ఉద్యమం నిరాటంకంగా కొనసాగించడానికి మంచి అవకాశం ఏర్పడింది. దానికి భార్య లక్ష్మీబాయమ్మగారి అండ తోడైంది.

చిన్నతనములో చదివిన పోతన భాగవతములోని "తమనందు నిఖిలభూతము లందు నొక భంగి సమహితత్వంబు జరగువారు" అను పద్యము, తిక్కనగారి భారత ములోని "ఒరులేయవి యొనరించిన, నరవర! అప్రియము తన మనంబునకు" అను పద్యము, నీతిమంజరిలోని "ఉపకారికి నుపకారము విపరీతముగాదు సేయ వివ రింపంగా" అను పద్యము ఆయనకు జీవిత పరమార్థమును ఉద్బోధించినవి.

## ఐర్లండులో బారిస్టర్ చదువు

లక్ష్మీనారాయణగారు 1913వ సంవత్సరంలో బారిస్టర్ చదవడానికై ఐర్లండు దేశం వెళ్ళారు. అక్కడ ఉన్న రోజులలో ఆయనకు ఐర్లండు స్వాతంత్ర్యోద్యమ నాయకుడైన "డి వెలరా"తో సన్నిహితపరిచయమేర్పడింది. ఐరిష్ ప్రజలు స్వాతంత్ర్యంకోసం సాగిస్తూవచ్చిన పోరాటాలు ఆయనమనస్సులో అంతకుపూర్వమే

నాటుకొనియున్న స్వాతంత్ర్య భావాలను మరింతగా ఉద్దీప్తం చేశాయి. డబ్లిన్ నగరంలో ఎక్కడ ఏ రాజకీయ మహాసభ జరిగినా ఆయన హాజరయ్యేవాడు. ఒక నాడు "లాన్సుబరీ" సభలో ఒకదొర ప్రసంగిస్తూ నల్లకూలీలను తీవ్రంగా విమర్శిస్తు న్నాడు. సభలో వున్నవారంతా కోట్లు, క్రాఫింగు తలకాయలతో ప్రకాశిస్తున్న మహానుభావులే! సభ మధ్యలోనుంచి ఒక తలపాగావ్యక్తి లేచి "నేను నల్లవాడినే. నల్లవాళ్ళను అవమానిస్తూ మాట్లాడినందుకు క్షమాపణ చెప్పక తప్పదు" అంటూ ఆ దొర ఉపన్యాసాన్ని నిరసిస్తూ ప్రసంగించాడు. సభలో వున్నవారు దిగ్భ్రాంతు లైనారు. ఆ యువకుని మానవతాదృక్పథానికీ, నిర్భీక చిత్తవృత్తికీ వారికి అతని పట్ల ఎంతో వాత్సల్యం కలిగించింది. ఆ తలపాగా వ్యక్తి ఉన్నవ లక్ష్మీనారాయణ గారే!

ఆ నాటినుంచీ తనజాతి సంస్కృతిపట్ల, సంప్రదాయాలపట్ల, వ్యక్తిత్వంపట్ల ఆయనకు విశేషమైన అభిమానం పెరిగింది. తాను తలపాగా ధరించడమేకాదు. తనతోపాటు ఉన్నతవిద్యకై ఐర్లండు వచ్చిన ఆంధ్ర విద్యార్థులందరిచేతా తలపాగాలు ధరింపజేశారు. వాళ్ళు కొన్న హాట్లు తగలబెట్టించారు. ఆ దేశపు గుడ్డలు ఎవ్వరూ కొనరాదని ప్రతిజ్ఞ చేయించారు. తాము ధరించే ఉన్నిబట్టలు భారతదేశం నుంచే తెచ్చుకోవలె నన్నారు. ఇట్లాగా, ఐర్లండులో చదువుతున్నప్పుడే ఆయన విదేశీవస్తు బహిష్కారానికేకాదు, విదేశీ ఆచార బహిష్కారానికి కూడా ఉద్యమం ప్రారం భించారు. మద్య మాంసాలు సేవించమనీ, మహిళలజోలికి పోమని వారందరిచేత ప్రమాణాలు చేయించారు. మధ్యలో ఒకసారి సెలవుల్లో స్వదేశానికి వచ్చారు. ఆంధ్రో ద్యమం గూర్చి గుంటూరులో శ్రీనివాసశాస్త్రి ప్రసంగించిన సభకు ఉన్నవ వారే అధ్యక్షత వహించారు. "రాజకీయ స్వాతంత్ర్యం లేనిదే, ఏ ఇతర సంస్కరణ ఉద్య మాలూ సత్ఫలితాలు ఇవ్వవనీ, ఐరిష్ ప్రజలలాగా భారతీయులుకూడా స్వరాజ్యం కోసం పోరాటం సాగించాలనీ" ఆయన ఆ సభలో చాటి చెప్పారు.

ఉన్నవవారు బారిస్టరు పరీక్షలో కృతార్థులై 1916 లో స్వదేశానికి మరలి వచ్చారు. మద్రాసు హైకోర్టులో న్యాయవాదవృత్తి ప్రారంభించారు. కాని అక్కడ భార్యకు అనారోగ్యంకారణంగా వారు ఎక్కువకాలం ఉండలేకపోయారు. మద్రాసులో నున్నప్పుడు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి వంటి ఆంధ్ర ప్రముఖులతో కలసి ఆంధ్రులకు ప్రత్యేక రాజకీయసంఘం ఏర్పడడానికి కృషి చేశారు. 1917 ఏప్రియలు 13వ తేదీన ఆంధ్రపత్రికా కార్యాలయంలో ఆంధ్ర నాయకుల సమా

వేశంలో సంఘ నిర్మాణానికి తీర్మానాన్ని ప్రతిపాదించడమేకాక, ఆ సంఘానికి ఒక కార్యదర్శిగాకూడ ఎన్నికైనారు లక్ష్మీనారాయణగారు.

ఆంధ్రోద్యమం

ఉన్నవ వారికి సంఘ సంస్కరణోద్యమం, రాజకీయోద్యమం రెండూ రెండు కళ్లు. రాజకీయంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేనిదే సంఘ సంస్కరణ సాధ్యం కాదని గ్రహించినవాడు ఆయన. రాజకీయోద్యమాలలో దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులు, ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు మొదలైనవారితో కలసి గ్రామ గ్రామాలలో పర్యటించి జాతీయ నిర్మాణ కార్యక్రమాలను గురించి ప్రచారంచేసి జాతిని జాగృతం చేశారు. 1910 లో ఏలూరులో జరిగిన కృష్ణా మండల సంయుక్త సభలలో మొట్టమొదట భాషారాష్ట్ర నిర్మాణము కోరుతూ తీర్మానాన్ని ఆమోదింపజేసి మరు సంవత్సరమే విశాలాంధ్ర నిర్మాణానికి అఖండప్రచారం చేశారు. 1912 మే లో కృష్ణా, గుంటూరు సంయుక్త సభలు నిడదవోలులో జరపడానికి చాలావరకు ఆయనే కారకులు. అ సభలలో మద్రాసు, మైసూరు. హైదరాబాదు, మహారాష్ట్ర, ఒరిస్సా ప్రాంతాలలో వున్న ఆంధ్ర ప్రాంతాలను కలపి జొన్నవిత్తుల గురునాథంగారు, ఉన్నవ వారు "విశాలాంధ్ర" దేశ పటాన్ని తయారుచేసి ప్రదర్శించారు. ఆ తరువాత 1913 మే 26వ తేదీన బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభలు జరిపినప్పుడు ఆహ్వానసంఘ కార్యదర్శులలో ఆయన ఒకరుగా వున్నారు. ఈ సభల తర్వాతనే ఆయన ఐర్లాండు వెళ్ళడం జరిగింది. ఐర్లాండు నుండి తిరిగివచ్చినతరువాత కూడ రేపల్లెలో జరిగిన గుంటూరుజిల్లా సంఘ సంస్కరణ మహాసభ అగ్రాసనాధిపతిగా, కొవ్వూరులో జరిగిన కృష్ణామండల సంఘ సంస్కరణసభకు అధ్యక్షుడుగా ఆయన ఎన్నోవిధాల ప్రజాహృదయాలను ప్రదీప్తం చేశారు. 1918 లో సత్తెనపల్లెలో జరిగిన గుంటూరు మండల రాజకీయసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు లక్ష్మీనారాయణ గారే. అదే సంవత్సరం కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతన సత్తెనపల్లిలో గుంటూరు జిల్లా అవసరాంధ్ర రాష్ట్రీయ మహాసభ జరిగింది. ఆ సభలో, మాంటేగ్యు మంత్రి ప్రతిపాదించిన రాజకీయ సంస్కరణలు కేవలం నేతిబీరకాయవంటివనీ, ఈ ప్రణాళికవల్ల ప్రజలకు కట్టు గుడ్డ, తిన తిండి లభించవనీ నిర్భయంగా చాటి చెప్పారు లక్ష్మీనారాయణ పంతులుగారు. ఆ తర్వాత బ్రిటిషు ప్రభుత్వం అరెస్టుచేసేనాటికి ఆయన గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘానికి అధ్యక్షులు. 1921 లో పాత పొన్నూరులో జరిగినసభ చిరస్మరణీయమైనది. పాత పొన్నూరు చెరువుగట్టు ప్రక్కనే పందిళ్ళు వేయించారు. ఈ సమావేశంలోనే

శాసనధిక్కారం చేయాలనీ, సత్యాగ్రహోద్యమాన్ని నడపాలనీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు వాదించారు. గొల్లపూడి సీతారామశాస్త్రిగారు వగైరాలు సత్యాగ్రహోద్యమానికి దేశమంత తయారుగాలేదనీ అఖిలభారత కాంగ్రెసు ఆమోదముద్రకూడా లభించలేదనీ, ప్రస్తుతానికి వాయిదా వేద్దామనీ ప్రతిపాదన చేశారు. మన గుంటూరు మండలం రాజకీయంగా సంపూర్ణ చైతన్యం పొందిందనీ, వెంటనే సత్యాగ్రహం ప్రారంభించుదామనీ గోపాలకృష్ణయ్యగారు పట్టుపట్టడంతో సభ జయ జయ ధ్వానాలతో తీర్మానాన్ని ఆమోదించింది. ఆ సభలోనే దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని "ఆంధ్ర రత్న" బిరుదుతో సత్కరించారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు.

ఈ విధంగా మొదటినుంచీ కాంగ్రెసు రాజకీయాల్లోను, సంఘ సంస్కరణ ఉద్యమాల్లోను ప్రధానపాత్ర వహించి ప్రజాఉద్యమ నిర్మాతగా, ప్రత్యక్ష కార్య కర్తగా కృషిచేసి ప్రజల హృదయాలను, ముఖ్యంగా యువకులను ఆయన విశేషంగా ఆకర్షించారు.

## కందుకూరి - ఉన్నవ

ఉన్నవ వారి స్త్రీ జనాభ్యుదయ ఉద్యమం విజయవంతం కావడానికి ప్రధాన హేతువు లక్ష్మీబాయమ్మగారనే చెప్పాలి. భర్త చేపట్టిన ప్రతి ఉద్యమానికి చేయూతనిచ్చి అర్ధాంగి శబ్దాన్ని సార్థక్యంచేసిన విదుషీమణి లక్ష్మీబాయమ్మగారు. ఆ రోజులలో రాజమహేంద్రవరం కేంద్రంగా కందుకూరి వీరేశలింగం పంతులుగారు సాగిస్తున్న సంస్కరణోద్యమం యువకులలో విశేష ప్రభావం ప్రసరింపజేసింది. అప్పుడసలు ఆడపిల్లలు పాఠశాలలకు వెళ్ళడం, ఉన్నత విద్యాభ్యాసం చేయడమంటే పరిహాసంగా ఉండేది. లక్ష్మీబాయమ్మగారు 1898 లో గుంటూరు కాపురానికి వచ్చారు. అప్పటికి లక్ష్మీనారాయణ పంతులుగారు ఎఫ్. ఏ. చదువుతున్నారు. ఆయన విద్యార్థిగా వుండే భార్యకు తెలుగు చెప్పారు.

ఉన్నవ దంపతులు మహిళాభ్యుదయానికి చేపట్టిన ముఖ్యమైన కార్యక్రమం వితంతు వివాహాలు చేయడం. 1902 సంవత్సరం అక్టోబరు 11 వ తేదీన వీరేశలింగం పంతులుగారిని గుంటూరుకు ఆహ్వానించి వారి ఆధ్వర్యములో మొట్టమొదటి వితంతు వివాహం చేయించారు. వితంతు వివాహాలకు రావడమే సాహసం, వచ్చి భోజనము చేయడమంటే మరింత సాహసం. వారికి ఆ రోజులలో వెలి తప్పదు. మానవతా మహితమైన మహోద్యమం చేపట్టిన ఉన్నవ దంపతులను ఈ సాంఘిక బహిష్కారాలు ఏమీ చేయలేకపోయినాయి. వారు కన్యాదాతలుగా ఉండి ఆ తరువాత పది

వితంతు వివాహాలు చేయించారు. వారి ఇల్లే వితంతు శరణాలయమయింది. స్త్రీ జనో ద్ధరణకు నడుముకట్టిన భర్తను కులస్థులంతా వెలివెట్టిన సందర్భంలో పుట్టింట్లోవున్న లక్ష్మీబాయమ్మగారు తల్లిదండ్రులను ధిక్కరించి చంటిబిడ్డలతో వచ్చి భర్తకు అండగా నిలచారు. ఆయన వితంతు పునర్వివాహాలు చేస్తుండగా, ఈ ఆడపిల్లలను సొంత బిడ్డలలాగా ప్రేమాభిమానాలతో పురుళ్ళుపోసి అత్తవారింటికి సాగనంపి వారందరికీ తల్లి అయినారు.

1906 – 1907 సంవత్సరంలో కందుకూరి సూచనానుసారం రాజమహేంద్ర వరం వెళ్ళి అక్కడ వితంతు శరణాలయం నిర్వహించారు. కాని వీరేశలింగం పంతులుగారు జాతీయోద్యమానికి విముఖులు కావడంవల్ల వారితో అభిప్రాయభేదం వచ్చి గుంటూరు తిరిగివచ్చి యథావిధిగా వితంతు వివాహాది సంఘ సంస్కార కార్య క్రమాలు నిర్వహించారు. ఈ వితంతు వివాహాలు చేసే సందర్భంలో అనేక అవరో ధాలు ఏర్పడేవి. వివాహం కావలసిన వితంతువులు ఎక్కువగా విద్యావంతులు కాకపోవడంవల్ల మగపిల్లలు వారిని పెండ్లి చేసుకోవడానికి అంగీకరించేవారుకాదు. కొందరు ముందుకు వచ్చినా వారిని సంఘబహిష్కారభీతి వెన్నాడుతూనే వుండేది. అందువల్ల వితంతువులకు మొట్టమొదట చదువు చెప్పించడం అత్యవసరమైంది. అట్లా చదువుకుంటే ఒకవేళ వివాహం కాకపోయినపక్షంలో వారికి జీవనోపాధులు కల్పించేవారు. ఆ రోజుల్లో మొదట కొండా వెంకటప్పయ్యగారు వేటపాలెం ప్రాంతంలో స్థాపించాలనుకున్న బాలికా విద్యాలయం సఫలంకాలేదు. అనంతరం 1912 లో వెంకటప్పయ్య గారితో పూనా పట్టణానికి వెళ్ళి లక్ష్మీనారాయణగారు కార్వే పండితులు నడుపుతున్న మహిళా విద్యాలయం ఎలా పనిచేస్తున్నదీ పరిశీలించి చూచి వచ్చారు.

## శ్రీ శా ర దా ని కే త న ము

స్త్రీ జనోద్ధరణకై ఉన్నవ వారు స్థాపించిన సంస్థలలో శ్రీ శారదానికేతనము జయపతాక వంటిది. 1922 సంవత్సరములో గుంటూరులో బ్రాడీపేటలో శ్రీ శారదా నికేతనమును స్థాపించారు. మొదట పదిమంది పిల్లలతో కాకాని పురుషోత్తం గారింట్లో ఇది ప్రారంభమైంది. దీనికి విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ప్రారంభోత్సవం చేశారు. జాతీయోద్యమ ప్రాబల్యంచేత మొట్టమొదట అందులో ఇంగ్లీషు తరగతులు పెట్టక హిందీ, సంస్కృతం, తెలుగు తరగతులు మాత్రమే నిర్వహించేవారు. ఆ తర్వాత స్త్రీ విద్యలో కళలకు ప్రాధాన్యం కల్పించా లనే సంకల్పంతో సంగీతం, చిత్రలేఖనాలు కూడా ఆరంభించారు. వీటికి తోడుగా

స్వతంత్రమార్గ జీవనమునకై కుట్టుపని, రాట్నము మొదలైన చేతి పనులు కూడా శాఖలుగా ఏర్పాటుచేశారు. ఈ రకంగా శారదా నికేతనమును జాతీయోద్యమ ఫలంగా ఒక నిర్మాణ కార్యక్రమంగా స్థాపించడం జరిగింది. తరువాత మునగాల రాజా నాయని వేంకట రంగారావు బహద్దూరుగారు గుంటూరులో తమకున్న ఖాళీస్థలమును శారదా నికేతనమునకు దానపట్టా వ్రాసి, రిజిష్టరుచేసి ఇచ్చారు. ఉదార హృదయులైన ప్రజల సహకారంవల్ల అనతికాలంలో శారదానికేతనం అభివృద్ధిలోకి వచ్చింది. ఎన్నో భవనాలు, పర్ణ కుటీరాలు వెలిశాయి. పూలమొక్కలు, ఫల వృక్షాలతో యీ విద్యాలయం ఒక శాంతినికేతనంలాగా, ఒక ఋష్యాశ్రమంలాగా తయారయింది. శారదానికేతనం బాలికలకు లక్ష్మీనారాయణగారు తండ్రి, లక్ష్మీబాయమ్మగారు తల్లి. విద్యాలయం ఒక పుట్టినిల్లు. శారదా నికేతనం ఆవరణలో ఒక రామదేవాలయము మును నెలకొల్పారు. ప్రహరీగోడలకు, దేవాలయ ప్రాకారాలకున్నట్లుగా తెల్ల సున్నము, ఎర్రని జేగురురంగు పట్టీలువేసి వుండేవి. ఈ సంస్థ ఆనాటికే 1944 లో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధ సంస్థగా రూపొందింది. [illegible] దీనిని ఎండోమెంట్సు డిపార్టుమెంటువారు స్వాధీనం చేసుకున్నారు. [illegible] ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి చల్లని చేతులతో ప్రారంభింపబడిన శారదా నికేతనం వేలాదిమంది స్త్రీలకు విద్యాభిక్ష పెట్టి, స్త్రీజన శ్రేయస్సాధనకు [illegible] చిహ్నంగా విరాజిల్లుతున్నది.

ఒక్క వాక్యంలో చెప్పవలెనంటే వీరేశలింగంగారి హితకారిణీ సమాజం [illegible] ఉన్నవ లక్ష్మీనారాయణగారి శారదా నికేతనం ఒకఅడుగు ముందుకు వేసిందని చెప్పుట అతిశయోక్తి కానేరదు.

## రాజకీయోద్యమములు

రాజకీయములకంటె ఉన్నవ వారికి సంఘ సంస్కరణమునందే శ్రద్ధ ఎక్కువ. సమాజంలో అట్టడుగునవున్న బడుగు జీవులు పైకి రానంతవరకు ఈ దేశానికి విముక్తి లేదని వారి అభిప్రాయం. అందుకే గాంధీమహాత్ముని సహాయ నిరాకరణ ఉద్యమానికి పూర్వమే 1916 లో నల్లపాటి హనుమంతరావు, పుతుంబాక లక్ష్మీనర్సయ్య, వాసిరెడ్డి సీతారామయ్యగార్ల సహాయముతో [illegible] పాలెంలో "కృష్ణాశ్రమం" స్థాపించారు. ఈ సంస్థకు లక్ష్మీనారాయణగారే అధ్యక్షులు. ఆ రోజులలో సంఘంలో అట్టడుగునవున్న నిమ్నజాతుల ఉద్ధరణకై స్థాపించిన సంస్థ యిది. నిరంతరము పరిశ్రమించి యావచ్ఛక్తిని ధారపోసి దాని అభివృద్ధి కోసమై కృషి చేశారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు జంకు కొంకులెరుగని దేశభక్తుడు. తాను పేదరికంతో నలిగిపోయినా మాతృదేశ సేవాచరణంలో సర్వస్వం సమర్పించిన మహనీయుడు. కష్టాలనే సుఖాలుగా మార్చుకొన్న దేశభక్తుడు. అంతేకాదు– ఆత్మస్తుతి, పరనింద తెలియని నిష్కళంక చరితుడు. రాజకీయంగా ఆయనతో విభేదించినా ఆయన శీలాన్నిగాని, త్యాగాన్నిగాని విమర్శించినవారు లేరు. వారితో పరిచయమున్న వారికి ఇది అనుభవ పునరుక్తము.

1920 లో మహాత్ముని రాజకీయ ప్రవేశంతో భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో మహోజ్జ్వలఘట్టం ఆరంభమైనది. జాతి స్వాతంత్ర్యానికై చతుర్విధ బహిష్కరణోద్యమం ప్రారంభమైంది. 1. విదేశీవస్తు బహిష్కరణ 2. సహాయ నిరాకరణోద్యమము, 3. కోర్టులను బహిష్కరించుట, 4. స్కూళ్ళు, కాలేజీలను బహిష్కరించుట మొదలగునవి ముఖ్యము. యంత్రసహాయముతో వస్త్రములు మొదలైన వస్తువులు తయారుచేసి దేశీయ చేతిపరిశ్రమలను, వృత్తులను నశింపచేస్తున్నారు. కాబట్టి భారతీయులు విదేశీ వస్తువులను బహిష్కరించాలని సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించారు. దేశీయ విద్యలను దేశీయ భాషలను విధ్వంసం చేస్తున్న బ్రిటిషు పరిపాలనకు తమ తోడ్పాటు ఇవ్వరాదని విద్యావేత్తలను యువకులను ఆయన ఉద్బోధించారు. మహాత్ముని పిలుపునందుకొనే ఉన్నవ లక్ష్మీనారాయణ గారు బారిష్టర్ వృత్తిని పరిత్యజించారు. ఖద్దరు ఉత్పత్తి శారదా నికేతనములోని నిర్మాణ కార్యక్రమాలలో ముఖ్యమైన శాఖ అయింది. గాంధీమహాత్ముని సహాయ నిరాకరణోద్యమంలో గుంటూరు జిల్లానుండి జెయిలుకు వెళ్ళినవారిలో ఉన్నవ లక్ష్మీనారాయణ గారు ప్రప్రథములని చెప్పవచ్చును.

## పుల్లరి సత్యాగ్రహము

పల్నాడు అడవి ప్రదేశము. అక్కడి ప్రజలు చిరకాలంనుంచీ కట్టె పుల్లలు ఏరుకొని, ఆకులు కోసుకొని ఏరుపిడకలు తెచ్చుకొంటూ స్వేచ్ఛగా జీవిస్తుండేవారు. ఆ అడవుల్లో పశువులను మేపుకొంటూ కొందరు కాలం గడుపుతున్నారు. ఈ స్థితిలో నాటి బ్రిటిషుప్రభుత్వము పుల్లరి అనే పన్ను వసూలుచేయడం ప్రారంభించింది. అడవిలోకి ఎవరినీ పోనీయక స్థానికోద్యోగులు బీదప్రజలను హింసిస్తూ, అక్రమంగా వారిపై కేసులు పెడుతూ, వారి పశువులను బందెలదొడ్డికి తోలుతూ నానాభీభత్సం సృష్టిస్తున్నారు. అటవీశాఖ ఉద్యోగులు తాము పెట్టిన కేసులకు తప్పుడు సాక్ష్యాలు సృష్టించి ఏదోవిధంగా ఋజువు చేసేవారు.

ప్రజా పీడనం విపరీతమై పోయింది. ఇటువంటి దుర్భర పరిస్థితులలో ప్రజలు ఎదురు తిరిగి పుల్లరి చెల్లించమని తిరుగుబాటు చేశారు. ఇదే పల్నాటి పుల్లరి సత్యాగ్రహం.

ఆ రోజులలో పోలీసు ఉద్యోగుల నిరంకుశ ప్రవర్తన ఎలా వుండేదో కొంత తెలిస్తేగాని ఈ పుల్లరి సత్యాగ్రహ రూపం అవగతం కాదు. ఒకనాడు తెల్లవారేసరికి నిద్రమంచాల మీదనే గ్రామాల నన్నిటినీ పోలీసు బలగంతో, సైనికులతో చుట్టుముట్టి మూకుమ్మడిగా అరెస్టులు చేశారు. పుల్లరి చెల్లించే వరకు ఆస్తులను జప్తు చేశారు. పశువులను బందెలకు తోలుకొని పోసాగారు. తల్లి దూడలను వేరుచేశారు. రైతాంగం యీ చర్యను సహించలేక పోయింది. వందలాది రైతులు పశువుల వెంటబడి వాటిని విడిపించుకోవడానికి ప్రయత్నించారు. ఇది నిరంకుశాధికారులకు, పోలీసులకు కోపకారణమైంది. అరెస్టు చేసినవారిని విడుదల చేయమని కోరిన రైతులపైనను, జన సమూహముల మీదను అనవసరంగా కాల్పులు కాల్చారు. నానా భీభత్సం చేశారు. పోలీసుల ఘోరదురంతాలు మించాలంపాడులో పరాకాష్ఠకు చేరుకున్నాయి. గ్రామస్థుల తరపున తానే పుల్లరి చెల్లించవలయునని పైకం తీసుకొని గ్రామస్థులతో కలిసి వస్తున్న శ్రీ కన్నెగంటి హనుమంతు అను రైతును, అతని పాలేరు వెల్లపల్లి శేషు (హరిజనుడు) ను కర్కశత్వంతో పోలీసులు తుపాకీ కాల్పులకు ఎరజేశారు. పైగా అధికార్లపై దౌర్జన్యం చేశారని తప్పుడు నేరాలు ఆరోపించి నిష్కారణంగా అనేక మందిని జయిలు ఖానాలో నిర్బంధించారు. గ్రామస్థులు ఎచ్చటా దౌర్జన్య ప్రతీకార చర్యలకు పూనుకొన్నట్లుగాని, అధికార్లపై హింసాచర్యలు జరిపినట్లుగాని ఏ విధమైన సాక్ష్యాధారములు కనిపించలేదు. శాంతియుతమైన పోరాటమే సాగించారు. అహింసా యుతంగానే సంవత్సర కాలం ఉద్యమాన్ని కొనసాగించారు. అయితే తమను బాధిస్తున్న ప్రభుత్వోద్యోగులను సంఘ బహిష్కారమునకు గురిచేశారు.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘము వారు సమావేశమై 1921 జులైలో ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు గార్లను సభ్యులుగ నియమించి, పలనాడు వెళ్ళి పుల్లరి సత్యాగ్రహం విషయమై సమగ్రంగా విచారించి నివేదిక సమర్పించమని తీర్మానించారు. వారిద్దరు ఆ తీర్మానం తీసుకొని కారులో జులై 17వ తేదీన బయలుదేరి నర్సరావుపేటమీదుగా గుత్తికొండ చేరుకున్నారు అక్కడ మోటారు చెడిపోయినందున అక్కడి నుంచి బండి కట్టించుకొని జూలకల్లు వెళ్ళి పల్నాడులో ప్రవేశించి విచారణ ప్రారంభించారు. ప్రజాందోళన ముమ్మరంగా సాగుతోంది. అది పతాకస్థాయికి చేరుకుంది. ఉద్యోగులపట్ల సాంఘిక బహిష్కారం తీవ్రరూపం దాల్చింది. ప్రభుత్వోద్యోగులు ఎంత నిస్సహాయస్థితిలో నున్నారో గుంటూరు

జిల్లా కలెక్టరు షిల్డుదొర స్వయంగా చూచాడు. గురజాల, మాచెర్ల గ్రామాల్లో మకాం చేసి ఈ బహిష్కార బాధలను, తత్ఫలితములను స్వయముగా అనుభవించాడు. తన క్రింది ఉద్యోగులు తనకు ఏమీ సప్లయిలు చేయలేక పోయారు. తీవ్ర చర్య తీసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఉద్యోగులకు బియ్యము, పాలు, పంచదార, కోడి గ్రుడ్లు మొదలగు వస్తువులు ఇచ్చుట గాని, అమ్ముట గాని చేయకూడదని కట్టడి చేశారు ప్రజలు.

ఆ నాడు జూలకల్లురయితులతో మాట్లాడినారు. భోజనంచేసి రెండెడ్ల బండి కట్టించుకొని మాచర్లకు ప్రయాణమయ్యారు. దారిలో కుండపోత వర్షము. బళ్ళు దిగి రోడ్డుమీద కాలక్షేపం చేయవలసివచ్చింది. శనివారం దుర్ముహూర్తములో బయలుదేరుటకు ఫలితమిది అనుకున్నారు. మాచర్ల పోవుట మానుకొని గురజాల చేరారు. అటనుండి రెంటచింతల చేరి, అక్కడ ఉపన్యాసము చేసిరి. తరువాత ఆహారిగారిని పొందుగలకు పంపి, లక్ష్మీనారాయణగారు మాచెర్ల చేరిరి. మాచెర్లలో రయితులతో సంప్రదించి, అక్కడ మకాములోనున్న కలెక్టరుగారిని చూడవలెనని తలచిరి. రైతులు గుర్రమునెక్కించి తప్పెటల మేళాలతో కలెక్టరు మకామున్న బంగళాకు తీసుకపోయిరి. కలెక్టరుతో సంప్రదింపులు జరిపారు. రైతుల కోర్కెలను వివరించి కలెక్టరుకు చెప్పారు. కలెక్టరు అంగీకరించలేదు. తరువాత మాచెర్లలో బహిరంగసభ ఏర్పాటుచేసి పరిస్థితులు రైతులకు వివరించి చెప్పారు.

ఆ రాత్రియే కలెక్టరు సాటింపు చేయించాడు. పుల్లరి కట్టనిదే పశువులను అడవికి పోనీయవలదని చాటించిరి. బహిష్కారము యథాప్రకారము జరుగుతున్నది. మాచెర్లలో ముస్లిములు చాలామంది కలరు. వారును యీ ఉద్యమంలో చేరి సత్యాగ్రహమునందు పాల్గొనుచున్నారు. దానితో కలెక్టరు దౌర్జన్యములు జరుగునని నిరూపించ ప్రయత్నించుచుండిరి. నబీసాహెబ్, చింతపల్లి హుసేను, జానహమ్మద్ అను ముగ్గురు ముస్లిములు 21 వ తేదీ మధ్యాహ్నము ఒక ఇంట్లో రహస్యముగా ఇద్దరు ఫారెస్టుగార్డులు అన్నము తినుచుండగా ఇంట్లో జొరబడి బయటకు మెడపట్టుకొని లాగుకొచ్చినట్లుగా ఆ సాయంకాలం ఒక కేసు మేజస్ట్రేటువద్ద దాఖలు చేయించారు. వాడే విచారణకు వాయిదావేసి, మరునటినాడు ఉదయము సమనులు జారీచేయించి, విచారణకూడా ఆనాడే వాయిదా వేయించారు.

ఆ నాడు 11 గంటలకు ముస్లిము ముద్దాయిలు ముగ్గురిని గుర్రములమీద నెక్కించి పెండ్లికుమారులను తీసుకవచ్చినట్లు మేళతాళములతో కోర్టుకు తీసుక వచ్చారు. ఈ ఉత్సవాన్ని కలెక్టరుతోసహా ఉద్యోగులెల్లరు చూచారు. ముద్దాయిలు

మేజస్ట్రేటు కార్యాలయంలో ప్రవేశించి విచారణకు సిద్ధమయ్యారు. ఈ విషయము తెలుసుకున్న లక్ష్మీనారాయణగారు కూడా విచారణను వీక్షించుటకు కోర్టుకువచ్చి చూచుచుండిరి. విచారణ జరిపి ముద్దాయీలకు ఒకరికి 2 నెలలు, మరొకరికి 6 నెలలు శిక్ష వేసి, మూడవవానికి వాయిదా వేశారు. ఈ స్థితిలో పాతూరు. రోశయ్యశాస్త్రి అను సబిన్స్పెక్టరు లక్ష్మీనారాయణగారివద్దకు వచ్చి సర్కిల్ ఇన్స్పెక్టరుగారు పిలుస్తున్నారని చెప్పి బయటకు తీసుకవెళ్ళి, 107 వ సెక్షనుక్రింద నోటీసు వారంటును జారీచేశారు. నరసింహాచార్యులుగారిని అడుగగా వారు పొందుగల వెళ్ళినట్లు చెప్పిరి.

వెంటనే లక్ష్మీనారాయణగారిని జిల్లా మేజస్ట్రేటువద్దకు తీసుకవెళ్ళారు. నోటీసు లోని సారాంశమేమనగా, 1. పల్నాటి ప్రజలను అడవుల చట్టములను అతిక్రమించు నిమిత్తము మీరు పురిగొల్పుచున్నారని (ఇన్ సైటింగ్). 2. మీరు అడివి ఉద్యోగులను సంఘబహిష్కారము చేయించుటకును,వారిని బెదరించుటకును పురిగొల్పు చున్నారని, 3. పల్నాటి శాంతికి భంగము గలుగజేయుచున్నారని నేరారోపణలుచేసి ఒక సంవత్సరమునకు సత్ప్రవర్తనకు పూచీకత్తు ఇమ్మని కోరిరి.

అందులకు సమాధానంగా లక్ష్మీనారాయణగారు విచారణలో పాల్గొని యీ విధముగా సమాధాన మిచ్చిరి.

నేనింకను ఫారెస్టు చట్టముల నతిక్రమించమని బోధించలేదు. "బాయకాటు" అనుమాట సరియైనది కాదు. మేము వచ్చునప్పటికే ఫారెస్టు ఉద్యోగులకు సప్లయిలు చేయకూడదను ఉద్యమము అమలు చేయబడుచున్నది. దానిని నేను దౌర్జన్యములు చెలరేగకుండా నడుపుటకు యత్నించితిని. అది వాస్తవము ఫారెస్టు ఉద్యోగులను బెదరించమని నే నెవ్వరికి బోధించలేదు. పల్నాడులో నావల్ల శాంతి కేమియు భంగము వాటిల్లలేదు. ఇప్పుడును శాంతిభంగమేమియు లేదు. కాని నేను శాంతిగా నుండుటకే తోడ్పడి పని చేయుచున్నాను. ఆ కారణముగా నేను జామీను ఇచ్చుటకు కారణములేమియు కనిపించుటలేదని చెప్పి, నేను యీ విచారణలో పాల్గొనను అన్నారు. తరువాత విచారణ జరిపి ఫారెస్టు గార్డులు ముగ్గురు, సబ్ ఇన్స్పెక్టర్ పాతూరు రోశయ్యశాస్త్రిగార్ల సాక్ష్యము తీసుకొని, లక్ష్మీనారాయణ గారికి, నరసింహాచార్యులుగారికి చెరో సంవత్సరము శిక్ష విధించిరి. శిక్ష విధిస్తూ కలెక్టరు "మీమీద నిట్టి వుత్తర్వు వేయవలసి వచ్చినందుకు విచారపడుచున్నానని" అనిరి. లక్ష్మీనారాయణగారు సమాధానము చెప్పుతూ మీకు విచారమెందుకు, నా దేశ

మునక్కై నా ధర్మమును నెరవేర్చినాను అని చెప్పిరి. తరువాత కలెక్టరు అచటనుండి వెళ్ళిపోయిరి. లక్ష్మీనారాయణగారిని మాచెర్ల జైలుకు తీసుకుపోతూండగా నరసింహాచార్యులుగారినికూడా అరెస్టుచేసి తీసుకవచ్చిరి ఆనాడే వారి విచారణ పూర్తి చెయించి శిక్ష విధించి లక్ష్మీనారాయణగారున్న చోటికే వారిని తీసుకవచ్చిరి. ఆనాటి రాత్రి జైలులోనే నిద్రించుచుండగా ఎవరో సుందరమైన బాలబాలికలు ఇద్దరు పాలుతెచ్చి మాకిచ్చి తాగించారు. వారు రామలక్ష్మణులవలె నున్నారు. వారు కంట నీరుకూడా పెట్టారు. ఇది మాకు విచిత్రమనిపించినది అన్నారు లక్ష్మీనారాయణగారు.

జైలుశిక్ష విధించినట్లు, ఇద్దరు నాయకులను రాయవెల్లూరు సెంట్రలు జైలుకు పంపుటకుగాను రైలులో గుంటూరుకు తీసుకవస్తున్నట్లు ముందుగానే గుంటూరు పట్టణంలో పొక్కింది. క్షణాలలో ఈ వార్త దావాగ్నిలాగా పరిసర గ్రామాలలో కూడా వ్యాపించింది. వేలకువేలు ప్రజాసమూహములు గుంటూరు స్టేషనుకు తరలి వచ్చాయి. ఒక మహాసముద్రములాగా ప్రజాసందోహమంతా స్టేషనును చుట్టుముట్టారు. రైలుస్టేషనుకు వచ్చేనప్పటికి ప్రజలు వారిపై పూలవర్షం కురిపించారు. కొండా వెంకటప్పయ్య పంతులుగారు, నడింపల్లి వేంకట లక్ష్మీనరసింహారావుగారు, కొండవెన్ను రామకోటేశ్వరరావుగారు, త్రిపురనేని రామస్వామిచౌదరిగారు వీరోచితమైన స్వాగతం ఇచ్చారు.

"వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరొ తెల్పుడీ,
పూసిపోదుము మెడనె వైతుము పూలదండలు భక్తితో"

అనే వీరగీతం ఆలాపిస్తూ లక్ష్మీబాయమ్మగారు వారి నొసట కుంకుమ పెట్టి మెడకు గంధముపూసి పూలమాల వేసి, కర్పూరహారతి ఇచ్చారు. అక్కడ చేరిన ప్రజలలో ఒకవైపున కట్టలుతెగి ప్రవహించే వీరావేశం, మరొకవైపున పట్టరాని దుఃఖావేశం, ఇంకొకవైపున బ్రిటిషు కిరాతకులపట్ల ఆగ్రహం ఒక్కసారి పెల్లుబికాయి.

రైలు స్టేషనునుండి వారిద్దరిని బయటికి తీసుకవెళ్ళటానికి పోలీసులు హడలిపోయారు. అక్కడకు చేరిన నాయకులు దారిఇమ్మని ప్రశాంతంగా ఉండమని కోరిన తరువాత పోలీసులు అడుగు ముందుకు వేయగలిగారు. నాయకులు ముందు నడుస్తూండగా పోలీసులు వారివెనుక వస్తూండగా, మహా ప్రజావాహిని "జయ జయ" నినాదాలతో, పూలజల్లులమధ్య ఆ మహానాయకులు సబ్‌జైలుకు చేరారు. వారిని రాయవెల్లూరు సెంట్రలుజైలుకు తరలించారు. తరువాత వారము రోజులు గుంటూరులో వర్తకులు హర్తాలు జరిపి కొట్లు మూయించిరి.

ఇది 1921 లో జరిగిన సన్నివేశం!

## రాయవెల్లూరు జైలు జీవితం

లక్ష్మీనారాయణగారు, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగారు రాయవెల్లూరు సెంట్రల్‌జైలుకు వెళ్ళినప్పటికి గంపగూడెం కుమారరాజా కోటగిరి వెంకట కృష్ణారావు బహద్దర్ వారు అప్పటికే బరంపురంనుంచి వచ్చి జైలులో వున్నారు. తరువాత వెన్నెలగంటి రాఘవయ్యగారు, ప్రతాపగిరి రామమూర్తిగారు వచ్చారు. పిమ్మట కందాళై శ్రీనివాసన్, దేశిరెడ్డి శేషురెడ్డి, కన్నెగంటి సూర్యనారాయణగార్లు వచ్చారు. లక్ష్మీనారాయణగారు అందరిని సాదరంగా పలకరించి క్షేమ సమాచారాలు విచారించి ధైర్యం చెపుతూండేవారు.

భారత భాగవతాలు పఠించి, అర్థ తాత్పర్యాలు చెప్పి కాలక్షేపం చేయనారంభించారు. అయినా కాలం గడవడం కష్టంగానే వుంది. ఒకనాడు జైలు సూపరెంటు ఆండర్సన్‌తో ఒక నవల వ్రాయవలెనని సంకల్పించాను, యక్సర్‌సైజు పుస్తకాలు ఇమ్మని ఒక కాగితం వ్రాసియిచ్చి చెప్పుకున్నారు. జైలు నిబంధనలప్రకారం ఏనాడు వ్రాసింది ఆనాడు చూపవలెనని, ఆ పుస్తకాలు పూర్తి అయినవెంటనే తన స్వాధీనంలో ఉంచవలెనని, ప్రభుత్వంవారు అంగీకరిస్తే శిక్ష ముగిసినతరువాత ఇవ్వగలమని జైలు సూపర్నెంటు చెప్పి పుస్తకాలు, పెన్సిలు పంపాడు. ఆండర్సన్‌కు లక్ష్మీనారాయణగారి పట్ల చాలా గౌరవ భావముండేదిట. అంతట శుభముహూర్తాన మాలపల్లి అను సంగ విజయం అను నవల వ్రాయనారంభించారు. ఈ నవలలో ధనాంధత, నిరంకుశత్వము నిరోధించటానికి జరిగిన అనేకరకాల సాత్వికనిరోధ యుద్ధమును వర్ణించారు. పల్నాటి వీర చరిత్రలోని యుద్ధరంగములనే మాలపల్లిలో కూడా చిత్రించారు.

"మనుష్యుణ్ణి పశుత్వంలోనుంచి దేవత్వమునకు పెంపుచేయడమే నా పని. అజ్ఞానం పశుత్వ చిహ్నం. లోకములో అజ్ఞానం నశింపజేయడానికి ప్రయత్నాలు చేస్తున్న మతకర్తలూ, సంస్కర్తలూ, బోధకులూ నా పరివారంలోనివారే. అజ్ఞానముతో పోరాడి గెల్చినవాడే ధన్యి. ముల్లోకాలను జయించినవానికంటె లోకములోని అజ్ఞానమును, ధనాంధతను, నిరంకుశత్వమును నిరోధించినవాడే వీరుడు. పలనాటి రంగములో యీ యుద్ధముకూడా ప్రదర్శిస్తా."

ఈ మాటలు ఉన్నవ లక్ష్మీనారాయణగారు పల్నాటి వీరచరిత్ర "నాయకురాలు" అనే నాటకములో ప్రతాపుడనే పాత్రచేత పలికిస్తారు.

"పరతంత్ర ప్రజలపాలి దుఃఖములు
చెప్పంగ శక్యమే శివునకు నైన."

అని పూర్వకాలమునాటి పలనాటి వీరచరిత్రలోని సుప్రసిద్ధ వాక్యము శ్రీనాథ కవిసార్వభౌముడు వ్రాసినదే అంటారు. ఈ విషయములను ప్రాతిపదికగా తీసుకొని, తాను జైలుకు వెళ్ళవరకూ తన జీవితానుభవాలను రంగరించి మాలపల్లి అనే మహా కావ్యమును సిద్ధపరిచారు. ఏ నాటికానాడు తాను వ్రాస్తూంటే దానిని ప్రతాపగిరి రామమూర్తిగారు ప్రతులను తయారుచేసేవారు. రెండవ ప్రతిని అతి రహస్యంగా భద్రంగా వుంచుతు ప్రథమ ప్రతిని జైలు ఉద్యోగులకు ఇచ్చేవారు.

లక్ష్మీనారాయణగారి ఇంటినుండి ప్రతి నెల గోంగూరపచ్చడి పార్శిలు వచ్చేదిట. దానిని కలిపి ముద్దలుచేసి మిత్రులందరకు తలోముద్ద పెట్టేవారుట. గంపలగూడెం కుమారరాజాగారన్నారు– "ఆ ముద్దలు తిన్నవాళ్ళలో నేను ప్రథముణ్ణి" అని. రాజాగారంటారు– జైల్లో సంవత్సరంపాటు ఆయనతో సహచర్యం చేసినా ఎన్నడూ ఎవరిగురించి కులప్రసక్తి రాలేదు అన్నారు. ఆయన చాలా తెలివిగలవారు. సోషలిస్టు భావాలు, గాంధీగారి భావాలతో మిళితమై వుండేవి. ఆయన అంతర్యాన్ని బయటకు పొక్కనిచ్చువాడు కాదు. గుంటూరుజిల్లా నందివెలుగునుంచివచ్చిన సూర్యనారాయణగారు మరో ఖైదీ విషయం పట్టించుకున్నాడని ఆయన చేతులకు బేడీలు తగిలించి, నైట్ సాయిల్ ఎత్తించడం ప్రారంభించారు. దీన్ని లక్ష్మీనారాయణగారు సహించలేకపోయారు. ఒకరోజు రాత్రి రాజాగారితో సంప్రదించారు. మన సెల్‌లోనున్న మలమూత్ర భాండాలు మనమే తీసిపారబోయుదామన్నారు. అందుకు రాజాగారు అంగీకరించారు. ఉదయమే మలభాండం లక్ష్మీనారాయణగారు, మూత్రభాండము రాజాగారు తీసుకవెళ్ళి పారబోశారు. ఈ విషయం జైలు వార్డెన్ సూపర్నెంటుకు ఫిర్యాదు చేయగా, సూపర్నెంటు వచ్చి విచారణ చేయగా, "తోటి ఖైదీలచేత చేయించే పనిని మేమూ చేశాము" అని సమాధానమిచ్చారు. మిమ్మల్ని చేయమని మేము చెప్పలేదుకదా? అన్నాడు సూపర్నెంటు. చెప్పకపోయినా తోటి ఖైదీలతోపాటు చేస్తున్నాము. "మీరు చేయరాదు, మానండి." "తోటి ఖైదీలు మానితే మేమూ మానుకుంటా" మన్నారు. అంతట సూపర్నెంటు "తోటి ఖైదీలనుకూడా మాన్పిస్తాము–మీరు కూడా మానుకోండని" చెప్పి మానిపించారు. కన్నెగంటి సూర్యనారాయణగారిచేత కూడా మానిపించారు. చేతులకు బేడీలు వేయడముకూడా మానేశారు. పై విషయాన్ని మాలపల్లి నవలలో రామదాసు చేసినట్లుగా చిత్రించారు లక్ష్మీనారాయణగారు. కాబట్టి రామదాసుపాత్ర లక్ష్మీనారాయణగారే అని అనుకొనుటకు వీలగుతోంది. ఈ ఘట్టము వల్ల ఆ విధంగా స్వాతంత్ర్యయోధుల గౌరవానికి ఏమాత్రం భంగం వాటిల్లినా జైలులో ఉండికూడా పోరాటం సాగించిన మహా యోధుడని చెప్పాలి.

సాహితీవేత్తగా ఉన్నవ వారికి సముచితస్థానం సంపాదించిపెట్టిన మాలపల్లి నవల రాయవెల్లూరు జైలులో ఉన్నప్పుడు వ్రాసిన గ్రంథం. అసలు దీని రచనో సంతమే సాహసోపేతమైనది. ఏ రోజు వ్రాసినదానిని ఆ రోజు సహచరులందరికి వినిపిస్తూండేవారు. రహస్యంగా ప్రతాపగిరి రామమూర్తిగారు మరో కాపీ తీస్తుండేవారు. దానిని రహస్యంగా భద్రపరిచేవారు. మొదటి కాపీపుస్తకం పూర్తి కాగానే సూపర్నెంటు స్వాధీనం చేసుకొని తీసుకుపోతూండేవాడు. ఎలా పంపారో మూడు భాగాల నవల ఎవరికి తెలియకుండా బయటికి వచ్చింది.

మొదటి భాగం పమిడిపాడు అగ్రహారీకులు బెల్లంకొండ రాఘవరావుపంతులు గారి ద్రవ్య సహాయంతో అయ్యంకి వేంకటరమణయ్యగారు ఎ. జి. ప్రెస్‌లో ఆంధ్ర పరిషత్‌వారిపేర ప్రకటించారు. అది వెలుగుచూడదని లక్ష్మీనారాయణగారు అనుకునేవారు. అందువల్లనే రెండు ప్రతులుగా వ్రాయడం జరిగింది. జైలు వార్డెన్‌ల సాయంతోనే యీ నవల బయటికి పంపబడిందట. వెంటవెంటనే మూడు భాగాలు అచ్చు పడిపోయాయి. ప్రభుత్వం వెంటనే ఆ నవల నిషేధించింది. అందుచేత నాల్గవ భాగాన్ని పదిహేను సంవత్సరాలు భద్రంగా అముద్రితంగానే దాచి వుంచారు. 1935–36 ప్రాంతంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు నాలుగు భాగాలు కలిపి పూర్తి నవల ప్రకటించారు. రాయవెల్లూరు జైలు జీవితం నిరంతరం సాహితీగోష్ఠిగా మారిపోయింది. మత సాంస్కృతిక విషయాలను సమీక్షించుకుంటూ మాలపల్లి రచన కొనసాగిస్తూ ఆయన విద్యుక్తధర్మం నిర్వహించారు. తమ అపూర్వ మైత్రికి చిహ్నంగా మాలపల్లి నవలను గుంపలగూడెం కుమారరాజా కోటగిరి వేంకట కృష్ణారావు బహద్దర్ గారికి అంకితం చేశారు. ఈ విధంగా కారాగారవాసం ఆయన సాహితీసృష్టికి హేతువుకావడం ఒక విశిష్టమైన సన్నివేశం.

## హరిజనులతో పంక్తి భోజనం

గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా పొన్నూరు ఫిర్కాలో (నేడు పొన్నూరు తాలూకా) ఆరెమండ అనే గ్రామమున్నది. దీనికి శివారుగా వుంది తాళ్ళపాలెమనే చిన్న పల్లె. ఇది హరిజనవాడ. ఈ గ్రామస్థులందరూ పండితులు. ఆయుర్వేద వైద్యులు. శాస్త్రులు, పురాణాలు క్షుణ్ణంగా చదివినవారు. తాళ్ళూరి సమ్మాదాసు గారు, ఈరా రాఘవదాసు, అగ్ని రామదాసు మొదలగువారు ఆ నాటి దాసుళ్లు. వీరు చీకటితో నిద్రలేచి కార్యకరణాలు తీర్చుకొని స్నాన సంధ్యలు పూర్తిగావించి, పట్టె వర్ధనాలు పెట్టుకొని, చెంగావి ధోవతి ధరించి, తెల్లని మల్లెపూవువంటి చొక్కా, ఉత్తరీయం వేసుకొని, ఒకచేత్తో కర్ర, మరో చేతితో మందుల భరిణ పుచ్చుకొని చుట్టు

పట్ల గ్రామాలకువెళ్ళి వైద్యంచేసి వస్తూండేవారు వీరిని అన్నికులాలవారు గౌరవించి మర్యాదగా చూస్తూ వైద్యం చేయించుకునేవారు. హరిజనులనే పట్టింపు లేకుండా వీరిచ్చిన ఔషధాలు సేవించేవారు. మధ్యాహ్నానికి తిరిగి ఇంటికిచేరి భోజనంచేసి విశ్రమించి సాయంకాలం పురాణం చదివే ఆచారం వీరికుండేది ఈ గ్రామమే నా మాలపల్లి నవలారచనకు నన్ను పురికొల్పిందని లక్ష్మీనారాయణగారు నాతో అంటూ ఉండేవారు. ఆ అరెమండ గ్రామమే నా మాతామహుల గ్రామము కావడం వల్ల వీరి అందరితో నాకు బాగా పరిచయముంది. 1933 లో మహాత్మాగాంధీగారు హరిజన యాత్రాసందర్భంగా ఆంధ్రదేశ పర్యటన చేసినప్పుడు కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు మహాత్ముని అనుసరించి యీ పల్లెకు విచ్చేశారు. ఆ హరిజనవాడలో నెలకొనివున్న పవిత్ర వాతావరణంచూసి గాంధీగారు ఆశ్చర్యపోయారు. చక్కగా ఆవుపేడతో అలికి ముగ్గులుపెట్టిన పెంకుటిళ్ళు. శ్రీవైష్ణవులవలె పరిశుభ్రంగా వున్న ఆ హరిజన స్త్రీలు, వారినిచూచి గాంధీగారు మనమంతా ఇక్కడ భోజనం చేద్దామనిచెప్పి వారితో కలిసి అంతా భోజనాలు చేశారు. మహాత్ముని పాదస్పర్శతో పునీతమైన ఆ తాళ్ళపాలెమే మా స్వగ్రామము.

## ఉప్పు సత్యాగ్రహము

మహాత్ముని పిలుపునందుకొని 1930 లో దేశమంతటా ఉప్పు సత్యాగ్రహం జరుగుతున్న రోజుల్లో గుంటూరులో ఆ మహోద్యమానికి సారధ్యం వహించినవారు ఉన్నవ లక్ష్మీనారాయణగారే. ఆ ఉద్యమ సంరంభం మరపురానిది.

బ్రహ్మాండమైన స్వరాజ్య ప్రభను 30 అడుగుల ఎత్తున కట్టించారు. దాని నిండా భరతమాత, కాంగ్రెసు నాయకుల చిత్రపటాలు అంటించారు. 14 ఎద్దులను కట్టిన బండిమీద నిలబెట్టినారు. ఉన్నవవారు వారి శిష్యబలగంతో నాదెళ్ళ కృష్ణయ్య మొదలైనవారు ఆ ప్రభకుముందు నిలచి లక్ష్మీనారాయణగారు రచించిన స్వరాజ్య దండకం, కాంగ్రెసు బుర్రకథ, స్వరాజ్య సోదె మొదలగు రచనలను మహోత్సాహంతో చదువుతున్నారు.

"ఆశ్శరభ శరభ, ఆశ్శరభ శరభ" అనే నినాదాలతో దిక్కులు పిక్కటిల్లిపోతూండగా, రెండువేలమంది స్వచ్ఛంద సేవకులు ఆ స్వరాజ్యప్రభ వెనుక బారులు తీర్చి నిలబడ్డారు. ప్రభకు ముందుభాగంలో తప్పెటలు తాళాలు– విజయభేరీ నినాదాలు. గుంటూరు చుట్టుప్రక్కల గ్రామాల జనమంతా మహోత్సాహంతో పాల్గొన్నారు.

ఊరేగింపు పట్టణ వీధులలో తిరిగితిరిగి ఆర్. అగ్రహారంలో కోనేటిగట్టుకు చేరింది. దాదాపు 2 వేలమంది స్త్రీ సత్యాగ్రహులు శారదానికేతనం బాలికలతో అచ్చటకు వచ్చి ఎదురయ్యారు. "వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ" అనే దేశభక్తిగేయం పాడుకుంటూవచ్చి స్వాతంత్ర్యయోధులకు స్వాగతం పలికారు. ప్రతి స్వచ్ఛందసేవకునికీ నుదుటిమీద వీరతిలకం తీర్చిదిద్దారు. రక్తచందనం గంధం పూశారు. మెడలో పూలమాల వేశారు. శారదానికేతనం విద్యార్థినిలు వాలంటీర్లకు రక్షబంధనం కట్టారు. వారిని అనుసరిస్తున్న జనం సుమారు ఒక లక్షమంది అయ్యారు. ఆ నాడు ఆ జనసముద్రంలో వీరరసం పెల్లుబికిందా అని అనిపించింది. కొండా వెంకటప్పయ్య గారింట్లో ఉప్పు తయారుచేశారు. జైళ్ళకు వేలాదిమంది వెళ్ళారు. ఈ సత్యాగ్రహోద్యమానికి వెన్నెముక ఉన్నవవారే అయ్యారు.

తరువాత మరికొంతమందితో తాటిచెట్ల సత్యాగ్రహం ప్రారంభం చేశారు ఆయన. ఈ క్రొత్త ఉద్యమానికి ఆయనే సృష్టికర్త. ఆంగ్లప్రభువులు యీ ఉద్యమాన్ని చూచి బేజారెత్తిపోయారు. శత్రువులను రెచ్చగొట్టే "పరాజయ పథకం" తయారుచేయడంలో ఉన్నవవారు సాటిలేని మేటి నాయకుడనిపించుకున్నారు.

ఈ విధంగా మహాత్ముని ఉద్యమాలకు గుంటూరు మండలంలో అండగా నిలచి స్వాతంత్ర్యసిద్ధికై స్థిరసంకల్పంతో కృషిచేసిన మహనీయుడు లక్ష్మినారాయణ గారు.

## విలక్షణ వ్యక్తిత్వం

ఉన్నవ లక్ష్మినారాయణగారి వ్యక్తిత్వం అతి విలక్షణమైనది. ఒకవైపున తీవ్రమైన జాతీయభావం— మరొకవైపున హైందవ సంస్కృతిపట్ల ప్రగాఢమైన అభినివేశం. ఇంకొకవైపున కులమత వర్ణ విచక్షణకు తావులేని అచలతత్వంపట్ల ఆసక్తి— ఆయనలో రాజకీయమూ, మతమూ పడుగుపేకల్లాగా పెనవేసుకపోయినాయి. నాకు ఉన్నవవారితో 1931 లో ప్రథమ పరిచయం. మేము బందరులో వుండగా మా పినతండ్రి గూడూరి వియ్యన్నగారు ఒకరోజున "వీరే ఉన్నవ లక్ష్మినారాయణ పంతులు గారు, మాలపల్లి నవలారచయిత, మన యోగ సభ్యులు" అని పరిచయం చేశారు. ఆయన వెంటనే "నువ్వు చిన్న ధన్వంతరివా?" అని అన్నారు. మేమంతా "సత్యయోగ సాధక మండలి"లో సభ్యులం. శ్రీ మైనంపాటి నరసింహము పంతులు గారు మా గురుదేవులు. మాస్టర్ సి. వి. వి. పరమ గురువులు, వీరు భృక్తరహిత

తారక రాజయోగ స్థాపకులు. తరువాత శారదానికేతనం కోసం దీపావళి చందాలు వసూలు చేయడానికి అప్పుడప్పుడు బందరు వస్తూండేవారు. ఒకరోజున మా ఇంట్లో సాహిత్యగోష్ఠి జరుగుతూవుండగా ఆయన అన్న ఒకమాట ఇప్పటికీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ వుంటుంది. "నా చేతిలో ఎల్లప్పుడూ భగవద్గీత వుంటూవుండేది. ఈ యోగంలో చేరినతరువాత భగవద్గీత చేతికి బరువై పోయింది" అన్నారు ఆయన.

తరువాత మేము బెజవాడకు వచ్చేశాము. లక్ష్మీనారాయణగారు తరుచు బెజవాడ వస్తూ, వచ్చినప్పుడల్లా మా ఇంటికివచ్చి మా ఆతిథ్యం స్వీకరించి తన పనులు చూచుకపోతూండేవారు.

మధుర కవి మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారిని స్వర్ణకంకణంతో సన్మానించాలని అవటపల్లి నారాయణరావుగారి ఆధ్వర్యంలో సన్మానసంఘం సభ ఏర్పాటు చేసింది. ఆ సభకు ఉన్నవ వారినే సభాధ్యక్షులుగా తెచ్చుకున్నాము. వారి అధ్యక్షోపన్యాసములో దేశమందు తెనుగుభాషయందు గొప్ప పేరు ప్రతిష్ఠలుకల కవులు చాలామంది కలరు. ఇతర భాషలందు అంతమంది లేరు. పూర్వ కవిత్వమునకు ఇప్పటి కవిత్వమునకు భేదముచూపుతూ బుచ్చి సుందరరామశాస్త్రి వంటి కవి "నభూతో నభవిష్యత్" అన్నారు. భక్తినిగురించి వ్రాసిన ఆయన పద్యాలకు ఆయనే సాటి అన్నారు. ఆయన శబ్దకల్పన తెనుగు నుడికారాలతో నిండి విలక్షణంగా వుంటుందని చెపుతూ 1921 లో బుచ్చయ్యగారు వ్రాసిన బుర్రకథను తార్కాణంగా పేర్కొన్నారు. "అంటరానివారెవరూ మావెంట రానివారే" అనే పాట ఆనాటి ప్రజానీకాన్ని ఎక్కువగా ఆకర్షించిందని చెప్పారు.

1930 ఉప్పు సత్యాగ్రహంలో జైలుకు వెళ్ళినప్పుడు కూడా జైలులో వూరకే కూర్చోలేదు. 'తిక్కన' కవిని గూర్చి ఒక నవల ప్రారంభించారు. ఈ నవల 6,7 అధ్యాయాలు పూర్తిచేశారు. ఇంతలో జైలునుంచి విడుదలయ్యారు. తిక్కన నవల ఆగిపోయింది. ఆ నవల పూర్తిచేయమని ఎన్నో పర్యాయములు ప్రాధేయపడ్డాను. ఏం చేసినా ఆగిన ఘంటం మళ్ళీ కదలలేదు.

1950 ప్రాంతంలో కీళ్ళవాతము, ఉబ్బసముతో బాధపడుతూ చికిత్సనిమిత్తమై డాక్టర్ టి. వి. యస్. చలపతిరావుగారింటిలో దిగారు. నాకోసం కబురంపారు. మంచంమీద నాల్గు తలగడలు రెండు పరుపులు ముందు వేసుకొని తలవాల్చి కూర్చు

న్నారు. ఆ స్థితిలో వారిని చూడలేకపోయాను. చూచి మందు యిచ్చాను. ఆరోగ్యం పొంది వెళ్ళిపోయినారు.

ఒకరోజు నల్లపాటి హనుమంతరావుగారు వచ్చి లక్ష్మీనారాయణగారి ఆరోగ్య మేమీ బాగాలేదని చెప్పారు. చూచివద్దామని గుంటూరు వెళ్ళాను. వారి స్వగృహం లోనే వున్నారు. నన్ను చూచి అమాంతం లేచి కౌగలించుకొని మంచంమీద కూర్చోబెట్టుకున్నారు.

నమశ్శివయ్యా ! శరీరం శుష్కించిపోతోంది. బుద్ధిపటిమ మాత్రం ఏమీ తగ్గలేదు. ఎక్కువ కాలం కళ్ళుమూసుకునే పడుంటున్నాను. కళ్ళుమూసుకుంటే కృష్ణపరమాత్మ నా సన్నిధానంలో వున్నట్లుగా వుంటోంది. అల్లాగే కాలం గడుపు తున్నాను. ఒక్కొక్కరోజు ఏమీ తోచదు. అప్పుడప్పుడూ వచ్చి చూచి వెళ్ళుతూ వుండు, అన్నారు. లేచి వెళ్ళి అలమారులో నున్న 'అక్బరు' పుస్తకం ఒకటి తెచ్చి యిచ్చారు. ఇది వుంచుకో అన్నారు. అదే చివరి చూపు.

పంతులుగారు దీర్ఘకాయులు. ఉదాత్తమైన విగ్రహము. ఆరడుగుల పొడుగు. ఆ పొడుగునకు తగిన లావు - ఈ ఒడ్డూ పొడుగులకు వన్నెతీసుకొని వచ్చే విశాల ఫాలభాగము. సుదీర్ఘ నాశిక - కొమ్ములుదిరిగిన గుబురు మీసాలు. దేహచ్ఛాయ మేలిమి బంగారు రంగు - అందుకు దీటైన గోధుమరంగు పట్టు తల పాగా. అందులో తోక జారవిడిచిన తలపాగ. నీలిరంగు కోటు. అదే రంగు ఇజారు. నల్లని ఫుల్ బూటు. ఇది ఆనాటి బారిష్టర్ వేషం.

అయితే ఆ తలపాగాలో దాక్కొని ఒక చిన్న పిలకజుట్టు. ఈ పిలకజుట్టు ఐర్లండు వెళ్ళినా ఆయన వదలలేదు. అది భారత జాతీయతా చిహ్నమని ఆయన మతం.

అసహాయోద్యమం నాటికి వేషం మారింది. పలనాటి ఒడుకునూలుతో నేసిన ఎఱ్ఱమన్ను రంగు ముతకగుడ్డతో కుట్టిన షేర్వాణి. అదే రంగు తలపాగ. నాటు పల్నాటి చెప్పులు.

జైలుకు పోయిన తరువాత మీసాలు మాయమైనాయి. క్రాఫింగు పోయి పిలక మాత్రం నిలిచింది. షేర్వాణీలు పోయి ఒక బనీను, తుండుగుడ్డమాత్రం

వెలిసింది. ఇవే స్థిరరూపం తాల్చాయి. ముఖాన పట్టి వర్ధనాలు వెలిశాయి. నిమ్మ పండు రంగు ఎండి ఒడిలిపోయిన శరీరం చివరకు నిలిచింది.

అటువంటి నిష్కళంక దేశ భక్తుడు - ప్రజా బంధువు - మానవతా మహితుడు - మాతృదేశ సేవలో సర్వస్వం సమర్పించిన త్యాగమయశీలి - ఉత్తమ పురుషుడు

శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారికీ శతసంవత్సర జయంతి సందర్భముగా నా భక్తిపూర్వక స్మృత్యంజలి.



ఉన్నవ వారి

# సాహిత్య జీవిత విశేషాలు

డా॥ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పి హెచ్. డి.

## పరిచయం

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు మానవ మాత్రుడు కాడు. మహా మనీషి; కేవలం ఒక వ్యక్తి కాడు, మహాసంస్థ; కేవలం ఊహాశాలి మాత్రమే కాడు, తానూహించిన, సంకల్పించినదాన్ని ఆచరణలో చూపించిన మహా కార్యదక్షుడు; కార్యదీక్షాపర తంత్రుడు; కేవలం ఊహాలోకాల స్వైరవిహారి కాడు; తనచుట్టూ వున్న సంఘాన్ని, సంఘంలోని వివిధ వ్యక్తుల్ని, వివిధ వ్యక్తుల మనఃప్రవృత్తుల్ని, నేలను, గాలిని సూక్ష్మాతిసూక్ష్మ దృష్టితో పరిశీలించి, సమస్తాన్ని చిత్తశుద్ధితో, నిజాయితీ (Sincerity) తో అభివర్ణించి కృతకృత్యుడైన రచయిత; కేవలం రచయితమాత్రమే కాదు; మహాత్ముని ప్రభావానికి లోనై, స్ఫూర్తిని పొంది, తన రచనలద్వారా ఇతరులను ప్రభావితుల్ని గావించిన మహా మేధావి; స్వాతంత్ర్య యోధుడు; సంఘ సంస్కర్త. అన్నిటినీ మించి మహా నవలాకారుడు; మానవతావాది.

గాంధీ, తిలక్కుల స్వరాజ్యవాదమూ, రాజారామ్మోహనరాయ్, కందుకూర్ల సంఘ సంస్కరణాభిలాష, ఐర్లండులో బారిష్టర్ చదివేటప్పుడు తెలుసుకొన్న బోల్షివిజం మొదలయినవి ఉన్నవకు స్ఫూర్తినిచ్చాయి. దాంతో సమున్నత దీప్తితో సమాజంలో అట్టడుగునపడి అణగారిన దీనుల హీనుల దైన్య హైన్య జీవిత విధానం చూసి హృది రగిలి కరిగి వారిని సమాజంలో సమున్నతులుగా చేయాలన్న కోరికతో వారిలోని బాహిరమైన మాలిన్యాన్ని రూపుమాపి, ఆర్థికస్థితిని మెరుగుపరచి, ఆంతరంగికంగా దయాసత్య శౌచాల్ని పెంపొందించాలన్న సదాశయంతో వివిధరీతుల స్పష్టీకరించారు మాలపల్లిలో. వారెన్నో యితర రచనలు చేసినా ఈ సదాశయములన్నిటికీ చక్కటి వ్యాఖ్యానం మాలపల్లి; వారి సాహిత్యమూర్తి కీర్తికి జయపతాక వీరి మాలపల్లి.

## వివిధ రచనలు

ఉన్నవ వారనగానే మనకు గుర్తుకొచ్చేది వారి మాలపల్లి నవల. అయితే వారు ఇతర రచనలు అనేకం చేశారు. అన్నిటా వారి ఆశయం ఒకటే. ఇవన్నీగూడా

సామాన్య ప్రజానీకాన్ని జాగృతం చేయడంకోసమే రచించినట్లు స్పష్టమవుతుంది. వారి సామాజికావగాహన అలాంటిది. ప్రధానంగా వారి రచనలన్నింటినీ నవలలు, నాటకాలు, కవితలు, వచన రచనలు, వ్యాసాలు అని వర్గీకరించవచ్చు. నవలల్లో మాలపల్లి విశిష్ట రచన. తిక్కన అనే నవల అసంపూర్ణం. ముద్రణ భాగ్యంసైతం నోచుకొన్నట్లు లేదు. వారి సాహితీ మూర్తికీర్తికి కలికితురాయి అయిన మాలపల్లి నవలా వైశిష్ట్య వివరణకు ముందు తదితర రచనలగూర్చి క్లుప్తంగా తెలుసు కొందాం. వారి నాటకాల్లో ఉత్తమమైంది నాయకురాలు. తక్కినవి: తిక్కన, అన్నమాంబ, సంగీత నాపసాని, సోదోయమ్మ సోది, హరిజన నాటకము. వాస్తవానికి వీటిని నాటికలనడమే సముచితం.

నాయకురాలు నాటకాన్ని పల్నాటి వీరచరిత్ర ఆధారంతో ఉన్నవ వారు రచించారు. చరిత్రపై అత్యంతాభినివేశం గల ఉన్నవవారు ఈ కథని నాటకీక రించినట్లు తెలుస్తుంది. వాస్తవానికి ఉన్నవ వారు బ్రహ్మనాయుడు అని నామకరణం చేస్తే బాగుండేది. కాని "నాయకురాలు" అని పేరు పెట్టారు. బహుశా నాగమ బుద్ధి కుశలత, శక్తియుక్తులు మొదలైన గుణాలు ఉన్నవవారిని ఆకర్షించి "నాయకు రాలు" అని పేరు పెట్టివుండవచ్చు. లేదా బ్రహ్మనాయుడి గుణగణాల్ని ప్రస్ఫుటీ కరించడం కోసం నాయకురాలి పాత్రనే ప్రధానంగా తీసికొని ఆ విధంగా చేసి ఉండ వచ్చు. తిక్కన భారతంపై ఎక్కువ మక్కువగల ఉన్నవవారు ఆంధ్ర భారతమైన పల్నాటి వీర చరిత్రని కథావస్తువుగా గ్రహించినట్లు స్పష్టమౌతుంది. ఇందులో పల్నాటి వీరుల వీరోచిత కృత్యాలు, పరాక్రమ ప్రాభవాలు, బ్రహ్మనాయుడి సర్వ మానవ సౌభ్రాతృ సిద్ధాంతం మొదలైన విషయాలతో పాటు ఆనాటి గాంధీమహాత్ముని ఉపదేశాల్ని స్ఫురణకుతెచ్చే రీతిని నాటకీకరించడం జరిగింది ఇంకా సర్వమతాలు సమానమని, దీనికి కులం, వర్ణం అడ్డుగోడలు కారాదని ఆకాంక్షించిన ఉన్నవ వారు చాలా సముచితరీతిని స్పష్టంగావించారు నాటకంలో. అందుకే చాపకూడు యేర్పాటు చేశారు నాటకంలో. వారి ప్రధాన ఆశయమైన పంచమోద్ధరణను ఇందులో చక్కగా ప్రతిపాదించారు. "అగ్రవర్ణములవారికంటె పంచములెక్కువ దుర్మార్గులు కారు. అందుచేత వారితో సాహచర్యము వలన యే అనర్థమును రాదు. ఆరోగ్య విషయమున వారి అలవాట్లు కొన్ని సరియైనవికావు గాని ఆ విషయమున వారిని బాగుచేయవలసిన భారము అగ్రవర్ణములమీదనే నిలచియున్నది. అసహ్యమున కోర్చి శిశువులను, తల్లిదండ్రులు లేవగింపక ఏవిధంగా సాకుతారో అగ్రవర్ణముల వారందరూ శిశుప్రాయులుగా ఉన్న పంచములను పుత్రప్రేమతో ప్రేమించి బాగు చేయడం ధర్మం. తల్లిదండ్రులకు శిశువులెట్లు అస్పృశ్యులు కారో పంచములు

అగ్రవర్ణములకు అస్పృశ్యులు కారు. వారిని ప్రేమించి బాగుచేయుట ఉభయులకు తరుణోపాయమే. మన హృదయములందు ప్రేమ ఉన్నయెడల వారు అస్పృశ్యులు కావడమునకు మారుగా మన హృదయాలింగమునకే అర్హులవుతారు. ప్రేమ లేకపోవడమే మన భేదమునకు కారణము,"—అని బ్రహ్మనాయుడిమాటల్లో తమ ఆశయాల్ని స్పష్టంచేశారు. అంతేగాక వర్గ సంఘర్షణని గూడా యిందులో ఉన్నవవారు సూచించారు. "చివరకు మీ పోరాటము పంచమ, పంచమేతర తగాదాలోకి దిగుతుంది" అని కన్నమనీడు అంటే బ్రహ్మనాయుడు "అంతకంటే బీదల భాగ్యవంతుల తగాదాలోకి దిగుతుందంటే సరిపోతుంది" అని స్పష్టం చేస్తాడు. ఈ విధంగా నాయకురాలు నాటకంలో ఉన్నవవారు తమ ఆశయాన్ని అడుగడుగునా ప్రతిపాదించారు. ఇతివృత్త నిర్వహణలో, పాత్ర చిత్రణలో, సన్నివేశ కల్పనల్లో, సంభాషణా చాతురిలో, నాటకీయ శిల్పాన్ని పరిరక్షించి చక్కటి నాటకంగా నాయకురాలిని సృష్టించారు. ఒక కొత్తదనంకూడా యీ నాటకంలో ఉంది. కథాగమనాన్ని అతికినట్టు చెప్పడానికి ప్రవేశ విష్కంభాలు ప్రయోగించడం సంస్కృత నాటక సంప్రదాయం. ఉన్నవ వారు వాటిని త్రోసిపుచ్చి సూత్రధారునివంటి ప్రతాపుడనే పాత్రని ప్రవేశపెట్టడమేగాక, తక్కిన అంకాల ఆరంభంలో పూర్వ పూర్వకథని, ఉత్తరోత్తర కథకు అతికినట్లుగా ఉన్నవవారు చెప్పించారు. దీనివల్ల ఉన్నవవారు తమ సదాశయాల్ని మరింత స్పష్టం చేయడం జరిగింది.

తిక్కన, అన్నమాంబ, సంగీత నాపసాని–ఈ మూడు ఉన్నవవారు రచించబూనిన "తిక్కన" అనే నవలలో కొన్ని భాగాలకు సందర్భోచితంగా కావించిన నాటకీకరణ. అద్దంకి ప్రభువైన మహారాష్ట్రి సారంగుడికి, మనుమసిద్ధికి జరిగిన యుద్ధంలో మనుమసిద్ధికి సంపూర్ణ విజయం లభించినా కొమ్మన యుద్ధంలో మరణిస్తాడు. ఆ వార్తను మారన కొమ్మన భార్యయైన అన్నమ్మకు అందజేయడానికి వస్తాడు. ఆ సందర్భంలో జరిగిన సంభాషణ "తిక్కన" నాటిక. అన్నమ్మ అనేక కారణాలవల్ల సహగమనం చేయడం మానేస్తుంది. 'అన్నమాంబ' అనే నాటిక "తిక్కన" నాటికకు అనుబంధమే. భర్తృ మరణానంతరం చెయ్యవలసిన కర్మకాండకు సంబంధించిన చర్చ యిందులో ప్రధానాంశం. సహగమనం అనవసరమనడానికి వేదాంతపరమైన ఆధారాల్ని నిరూపిస్తుంది అన్నమాంబ. మూడవది సంగీత నాపసాని. సంగీత నావసాని తిక్కన కూతురు. "కడాని" అని కూడా వేరొక పేరు. అసలు పేరు "గాయత్రీదేవి", వయసులో చిన్నదైనా అద్భుత

శక్తియుక్త సంగీత నాపసాని. అపురూపమైన సంగీత జ్ఞానం కలది. పక్షుల నాదాలలో సంగీతాన్ని, ప్రతి వ్యక్తుల అడుగుల సవ్వడిలో తాళాన్ని గుర్తించ గలిగిన అద్భుత శక్తిగలది. చిన్నపిల్లల్లో ఉండే అమాయకత్వమూ, పండి పోయిన వ్యక్తి అనుభవాలు నాపసానిలో మనం చూస్తాం. "సోదోయమ్మ సోది" అన్న నాటికలో గాంధీజీ గొప్పదనాన్ని, ఆయనతెచ్చే ప్రేమరాజ్యమైన స్వరాజ్యాన్ని గూర్చి ఒక సింగి సోదె చెపుతుంది. బహుశా ఉన్నవవారి స్వరాజ్య సోదె యిదే కావచ్చు. "హరిజన నాటకము" అనేది నాయకురాలు నాటకంలోని రెండో అంకం మూడోరంగం. ప్రత్యేక సందర్భంలో ప్రదర్శించ డానికి దీన్ని గైకొని వుండవచ్చు. అంతేగాని యిది ఒక ప్రత్యేక నాటకం కాదు. పంచములు చెన్నకేశవాలయంలో ప్రవేశించడానికి ప్రయత్నిస్తున్న సమయంలో అగ్రవర్ణాలవారు అడ్డగించగా కన్నమదాసుకి దేవాలయం బయటే చెన్నకేశవుడు దర్శనమిస్తాడు. "దర్శనమాయె సందర్శనమాయె" అంటూ ఆనందంతో పొంగి ఆడుతూ, పాడుతూ ఆనందిస్తాడు కన్నమదాసు. కులం, వర్ణం ప్రధానం కాదని చిత్తశుద్ధి ప్రధానమని కన్నమదాసు స్థితిని జూచిన అగ్రవర్ణులు ఆశ్చర్యచకితులౌ తారు. ఆ సందర్భంలోనే అన్నివిధాలా అగ్రవర్ణులకంటె పంచములే ఉత్తములని వారిని సానుభూతితో జూచి సముద్ధరించవలసిన బాధ్యత అగ్రవర్ణులదని, కుల మత భేదాల్ని పాటించడం సముచితం కాదని ప్రబోధిస్తాడు బ్రహ్మనాయుడు.

"ఉన్నవ రచనలు కొన్ని" అనే గ్రంథంలో ఉన్నవవారి కవితా విభాగంలో వారి "భావతరంగాలు" అనే పేరుతో వారి కవితల్ని ముద్రించారు. ఇవి 1933 సం॥లో చెన్నపురిలో ప్రథమ ముద్రణకు నోచుకొన్నాయి. ఇందులో ఏలలు, సుద్దులు, చిందులు, బుర్రకథలు మొదలైనవి వున్నాయి. ఇవన్నీగూడా జానపద గేయ బాణీల్లో రచితమై ఉండడం విశేషం. అంటే ఉన్నవవారికి జానపద గేయా లపై యున్న మక్కువ స్పష్టమవుతుంది. వాస్తవానికి ఉన్నవవారు ప్రజలకోసం ప్రజల భాషలో రాయాలన్న తపన (commitment) ఉన్న రచయిత. వీరు మాలపల్లి నవలకూడా వాడుకభాషలో రచించి కృతకృత్యులయ్యారు. ఈ జానపద గీతాలమీద అత్యంతాభినివేశం ఉన్నవవారికున్నట్లు అనేక విధాలుగా తెలుస్తుంది. కృష్ణాపత్రికలో 1922 నుంచీ అనేక జానపదగీతాల్ని ప్రకటించినట్లు తెలుస్తుంది. మాలపల్లినవలలో సైతం సందర్భోచితంగా జానపదగేయాల్ని, తత్వాల్ని ప్రవేశ

పెట్టారు. సంగదాసు మరణానంతరం పెద్దదినం నాడు అప్పాదాసు "చరమగీతం" అనే పేరుతో సంగదాసు సద్గుణాల్ని యాల పాటగా రచించి చదువుతాడు. ఇది జానపద ఫణితిపై ఉన్నవవారికున్న మోజును స్పష్టం చేస్తూంది. భావతరంగాలనే కవితల్లో ఏలపాట, ఆవుల కాపరులు, తంధానపాట, లోటిపాట, దయ్యాలపాట, పూవుపాట, మేకపాట, యశోదావైభవము, బుడబుడక్కల జోస్యం అన్నవాటితో పాటు మాలపల్లిలోని తక్కెళ్ళ జగ్గడి బుర్రకథసైతం చోటు చేసుకుంది గ్రామీణ ప్రజల ఆశల్ని, ఆకాంక్షల్ని వ్యక్తం చేయడంతో పాటు ప్రజలంతా ఒక్కటే అనే ఆశయాన్ని అన్నింటా స్పష్టం చేయడమే ఉన్నవ వారి ధ్యేయంగా గోచరిస్తుంది.

వచన రచనల్లో ముఖ్యంగా మూడు కనిపిస్తాయి. ఈ మూడు 1917 లో రచించినట్లు తెలుస్తుంది. జొన్నవిత్తుల గురునాథం గారితో కలిసి "ఇండియా రాజ్య తంత్రము" రచించారు. అక్బర్ చక్రవర్తి మత సామరస్యానికి ముగ్ధులైన ఉన్నవవారు "అక్బర్ చక్రవర్తి చరిత్ర" ను రచించారు. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాల్ని తెలుగులోనికనువదించారు. ఈ గ్రంథాల రచన కూడా వారి సదాశయానికి అనుగుణంగానే నడిచింది.

ఉన్నవవారి రచనా వ్యాసంగం వీటితోనే ముగియలేదు. అనేక సందర్భాల్లో వివిధ విషయాలపై అంటే సాహిత్యం, మతం, సాంఘికం, రాజకీయం, జానపద కళారీతుల్లో ఒకటైన బొమ్మలాటలు మొదలైన వాటిపై పెక్కు వ్యాసాలు రచించి తమ పాండిత్య ప్రకర్షని ప్రకటించారు ఉన్నవవారు.

ఇవి గాక కృష్ణరాయబారం, సంజయ రాయబారమనే రచనలున్నట్లు తెలుస్తుంది. అవి యే సాహిత్య ప్రక్రియలకు చెందినవో తెలయరాలేదు. ఇదీ ఉన్నవవారి సాహితీ జీవిత స్థూల పరిచయం. ఇక మాలపల్లి విశిష్టతని పరిశీలిద్దాం.

మాలపల్లి

"It (Malapalli) is one of the very few works of undoubted genious in Telugu. You know how rare such works are in our languages.................

It is written in the colloquial or gramya style. I myself belong to the classical variety. But two works have shown how all the effects of literature, line, colour, and expression could

be produced by the colloquial brush provided, of course, it is handled by a master, viz Kanyasulkam of Appa Raw and this novel of low and humble life, by Unnava Laxmi narayana".

మాలపల్లిపై ప్రభుత్వం విధించిన నిషేధాన్ని తొలగించవలసినదంటూ ప్రభుత్వానికి సిఫార్సుచేస్తూ మాలపల్లి నవల విశిష్టతను గూర్చి కట్టమంచి రామలింగారెడ్డి గారు చెప్పిన మాటలివి. వాడుకభాష బలాన్ని చవిచూపిస్తూ చక్కటి సామాజిక స్పృహతో అనుభవాల్ని జోడించి చేసిన అత్యద్భుత రచన ఉన్నవవారి మాలపల్లి. దీనికి దీటైన నవల ఆనాటికీ, ఈనాటికీ లేదు. ముమ్ముందు వస్తుందేమో వేచి చూడాలి. ఆనాటి తెలుగు నవలా సాహిత్యాన్ని పరిశీలిస్తే ఒక్కొక్కటి ఒక్కొక్క దృక్కోణం నుంచి చూసినప్పుడు గొప్పవిగా కన్పించవచ్చు. కాని మాలపల్లి నవల ఎన్ని దృక్కోణాలనుంచి పరిశీలించినా అన్నివిధాలా అత్యున్నతమై అన్నిరకాల వ్యక్తులకీ ఆనందాన్ని ఆపాదిస్తుంది. తెలుగు నవలా సాహిత్యంలో యిదొక మహేతిహాసం (Epic) అని చెప్పడం సమంజసం. అందులో లేనిది ఎందులోను లేదు. నవలకు గౌరవం చేకూర్చడానికి ఆరు అంగాలుండాలంటారు లాక్షణికులు. అవి "ఇతివృత్తం, పాత్రలు, సంభాషణ, ఆయా సన్నివేశాలలో సంఘటనల కనుగుణమైన వ్యక్తుల వర్తన, శైలి, జీవిత తత్వ నిర్దేశం (Philosophy of life). ఈ లక్షణాలన్నీ మాలపల్లికి వర్తిస్తాయి. ఉత్తమ శిల్పియైన రచయిత రచనలో ఈ లక్షణాలన్నీ తమకు తామై ఒదిగి ఉండి ఆ రచనా విశిష్టతకు కారణభూతమౌతాయి. అదే ఉన్నవవారి నవలలోని గొప్పదనం.

మాలపల్లికి మరోపేరు సంగవిజయం. సంగదాసు విజయమే సంగ విజయం. ప్రథమ భాగంలోనే సంగదాసు మరణించినా సంగదాసు జీవితం తర్వాతనే ఆరంభమైంది. అందరి హృదయాల్లో సంగదాసు చిరస్థాయిగా నిలిచిపోయాడు. మిత్రుడు రామానాయుడుతో సెలవు తీసికొంటూ "నన్ను మరచిపోకు" అన్న మాటలు, మరణిస్తూ "మనమే గెలుస్తాం" అన్న మాటలు ఫలించి మాలపల్లిలో విజయ కళాశాల స్థాపనతో మాలపల్లె మునిపల్లెగా చివరి దశలో మారినప్పుడు యిది నిజంగా సంగవిజయమనిపిస్తుంది.

ఇతివృత్తం

1920_22 ప్రాంతంలోని తెలుగుదేశ స్థితిగతుల చిత్రణమే మాలపల్లిలోని యితివృత్తం. ఇందులో ప్రధాన వ్యక్తి రామదాసు. రామదాసు జీవిత చరిత్ర

మాలపల్లి. రామదాసు జీవిత పరిణామం మాలపల్లిలోని యితివృత్తం. ఆ ప్రధాన వ్యక్తి ననుసరించి చేయబడ్డ సమస్త మానవకోటి జీవిత చిత్రణ మాలపల్లి. అందుకే మాలపల్లి మానవ ధర్మ పరిణామ చిత్రణ. అంటే మానవుల్లోని ఆశలు, ఆకాంక్షలు సుఖాలు, దుఃఖాలు, బాధలు, కష్టాలు, నష్టాలు, పగా, ద్వేషం, వలపు, కామం. జయాపజయాలు, మానావమానాలు చివరికి మానవ జీవిత పరిణామం ఎలా జరుగుతుందో నిరూపించడమే మాలపల్లి నవలాధ్యేయం. వీటన్నింటినీ అద్దం పట్టినట్లు నవలలో చిత్రించి తరించారు ఉన్నవవారు. మాలపల్లి నవల రామదాసు తన చేను స్థితిగతుల్ని చూసుకొంటున్న సన్నివేశంతో ఆరంభమై, మాలపల్లె మునిపల్లెగా మారిన సందర్భంలో రామదాసు మహర్షియై విజయ కళాశాల గురుకులానికి కులపతిగా కుదరడంతో ముగుస్తుంది. అంటే యితివృత్తంలో ఒక ఎత్తుగడ, ఒక ముగింపు చక్కగా కుదిరాయని స్పష్టమౌతుంది.

మాలపల్లి నవల గ్రామీణ జీవితంతో ఆరంభమై పట్టణ నాగరికత, నగర జీవనరీతి, సెటిల్మెంట్ దుస్థితి, జైళ్ళలోని అధికారుల ఆగడాలు, ఖైదీల కఠిన శిక్షలు చిత్రించబడ్డాయి. రామదాసు కుటుంబగాధ ప్రధానమైంది. చౌదరయ్య కుటుంబంతో యిది ముడిపడింది. రామదాసు రెండో కొడుకు సంగదాసు చౌదరయ్య యింటిలో జీతగాడు. సంగదాసుకీ, చౌదరయ్య కొడుకు రామానాయుడికీ గాఢ మైత్రి. సంగదాసు కూలీలకు బాసటయై సమ్మెను కట్టిస్తున్నాడన్న కోపమూ, తన కుమారుణ్ణి పంచమోద్యమంలోకి లాగి చెడగొడుతున్నాడన్న అపోహవల్ల ద్విగుణీకృతమైన ద్వేషమూ పెచ్చురేగిన చౌదరయ్య రాగోలతో సంగదాసు తలపై కొట్టగా సంగదాసు మరణిస్తాడు. దీనితో నవల మంచి ఉత్సుకతతో నడవడం ఆరంభిస్తుంది. పంతులు సాయంతో పోలీసుల పోరు ఐదువేలతో తప్పించుకున్న చౌదరయ్య సంగదాసు పెద్దదినం తర్వాత రామదాసు ఆస్తినంతా జప్తుచేయించి వశపరచుకుంటాడు. రామదాసు కుటుంబం నిరాశ్రయ మవుతుంది. దీనికంతటికి చలించిపోయి యింటినుంచి వెళ్ళిపోయి ధర్మకన్నాలు చేయడం మొదలుపెడతాడు వెంకటదాసు. ఆ వెనుక తక్కెళ్ళ జగన్నాథం అనే పేరుతో దోపిడీలు చేసి సంతానులతో ఉంటూ ధనవంతులను దోచి బీదలకు పంచిపెట్టడం ఆరంభిస్తాడు. సంగదాసు మరణంతో రామానాయుడు పంచముల, కార్మికుల సేవలో నిమగ్నుడు కావడం, ఇతని పినతల్లి కొడుకు మోహనరావువై కమలమ్మకు మోహం పెరిగి అతనితో లేచిపోయి తిరిగి స్ఫోటకంతో తిరిగివచ్చి సాహుకి సేవచేస్తూ వాడి మరణంతో ఆమె మరణించడం, రామదాసు కుటుంబం సెటిల్మెంటుకి పోవడం, అక్కడ పౌలు దురాగతాలకి లోనుగావడం, రామదాసు మాలక్ష్మమ్మ జైలుకుపోవడం జ్యోతీ అప్పా

దాసుల సహగమనం, వెంకటదాసు పోలీసులతో కల్గిన ఘర్షణతో క్షతగాత్రుడై జైలుకు రాగా పుత్రుని దీనస్థితిని జూచి మాలక్ష్మి మరణించడం, ఆ వెనుక వెంకటదాసు మరణం, వీటినన్నిటినీ చూస్తూ జైలు జీవితం గడుపుతూ సర్వసంగ పరిత్యాగియై స్వరాజ్యానంతరం విడుదలయి, రామానాయుడు, వెంకటయ్యల త్యాగం మూలంగా సంగదాసు ఆకాంక్షించినట్లు స్థాపితమైన విజయ కళాశాల కులపతి కావడంతో నవల ముగుస్తుంది. ఈ కథని ఎంతో చక్కగా చిక్కగా నవలా నిర్మాణం చేసి ధన్యులయ్యారు ఉన్నవవారు. గ్రామీణ జీవితంలోని రకరకాల స్థితిగతుల్ని ఈ నవలలో ఉన్నవవారు కన్నులకు కట్టినట్లు చిత్రించారు. జమీందారు చౌదరయ్య దౌర్జన్యం, అతని నమ్మినబంటు పంతులు పన్నాగం, మునసబు కరణాల మోసాలు, మాలపల్లిలోని అలగా జనం అగచాట్లు, కూలీల సమ్మెలు, కోర్టు అధికారులు, వకీళ్ళు, వకీలు గుమాస్తాలు గావించే ఘోరాలు, సెటిల్మెంట్ లలో ఫోవరీలు, కాంట్రాక్టర్లు చేసే పాపాలు, పోలీసుల లంచగొండితనం, జైలు అధికారుల మోసాలు, లంచగొండితనాలు, అణచివేసే విధానం, స్ఫోటకం వ్యాపించినపుడు మునిసిపాలిటీ ఉద్యోగుల మోసం, దగాలు, ఆయాచోట్ల అన్నిటా ప్రజల దుస్థితి, ధర్మకన్నాలు, అడవుల్లో సంతానుల జీవిత విశేషాలు, ప్రభుత్వం వారినందరినీ అణచివేయడానికి చేసిన ప్రయత్నం మొదలైనవన్నీ సూక్ష్మాతి సూక్ష్మంగా నవల అంతటా పరివ్యాప్తమై ఉండటం పరిశీలించవచ్చు ఇవన్నీ బాహిరమైనవి. ఇంతకంటె మానవ అంతస్తత్వాన్ని పరిస్ఫుటంగా ఉన్నవవారు స్పష్టం చేయడం విశేషం. ఇదే మానవధర్మ పరిణామ నిరూపణ, పాశ్చాత్యనాగరికత పారిశ్రామిక విప్లవం, స్వరాజ్యోద్యమం, జాతీయ కాంగ్రెస్ ప్రభావం, తిలక్ గాంధీజీ ప్రసాదించిన చైతన్యం, మొదలైన వాటి మూలకంగా సామాజికంగా, ఆర్థికంగా, పారమార్థికంగా వస్తూన్న మార్పుల్ని, ధనవంతులు ఎలా దోపిడీకి దొరకొన్నది, అణగారిన జనం ఎలా మరింత అణగారిపోతున్నది మొదలైన సమస్త విషయాలు సూక్ష్మాతి సూక్ష్మంగా స్పష్టంచేశారు. పంచముల సముద్ధరణం, కార్మికులకు న్యాయం చేకూర్చాలన్న ఆకాంక్ష, గాంధీజీ 'అసహాయ యోగము' ఒక ప్రక్క, బీదల అభ్యుదయానికి ధనవంతుల్ని దోచడమైనా ఉచితమేనన్న పద్ధతి మరో ప్రక్క అత్యంత వైచిత్రితో చిత్రించారు ఉన్నవవారు. ఉన్నవవారు వ్యక్తితః ఆస్తికులు అందుకే మాలపల్లిలో పంచముల సముద్ధరణం కోరినా మతంపైనా, దేవునిపైనా అచంచల విశ్వాసమున్నట్లు రామదాసు పాత్ర, సంగదాసు, రామానాయుడు పాత్రల ద్వారా వివరించారు. అయితే వెంకటదాసు పాత్రద్వారా అసమర్థుడైన దేవుణ్ని ఎదిరించారు. అచలబోధ, దానికి సంబంధించిన తత్వాలు, కీర్తనలు, ప్రేమ భక్తి అంటే మధురభక్తి, మోహనశృంగారం, దాని పర్యవసానం మొదలైన వాటన్నింటి వివరణలో సాంస్కృతిక వారసత్వాన్ని వివరించారు ఉన్నవవారు.

మాలపల్లి నవల నాలుగు భాగాలుగా విభజించబడి, మొదటి భాగంలో ఇరవై అయిదు ప్రకరణాలు, రెండో భాగంలో ఇరవై రెండు ప్రకరణాలు, మూడో భాగంలో ఇరవై నాలుగు ప్రకరణాలు, నాలుగో భాగంలో ఇరవై ఒక్క ప్రకరణాలు గల బృహద్గ్రంథం. ఇలాంటి ఇతివృత్తానికి తగిన రీతిలో సన్నివేశ కల్పనం, సంభాషణ రచనారీతి, కథాకథననైపుణ్యం, పాత్రలశీల వర్తనలు, సామాజిక స్పృహతో సమస్తమూ వాడుకభాషాబలాన్ని ప్రకటిస్తూ ఆ శైలీ విశ్వాసాన్ని స్పష్టంచేస్తూ చాలా మనోజ్ఞంగా ఉన్నవవారు మాలపల్లి నవలా నిర్మాణం గావించారు.

చక్కటి ఇతివృత్త నిర్మాణంతోపాటు సజీవపాత్ర చిత్రణ ఉత్తమ నవలా ప్రాశస్త్యానికి హేతు భూత మవుతుంది. తద్విరహితమైన నవల సహృదయ హృదయ రంజకం కాజాలదు నవలాకారుడు లోకవృత్త పరిశీలనకి జీవితానుభవం జోడించి రకరకాల వ్యక్తులు, స్వభావాలు సముచితరీతిని చిత్రించవలసిన అగత్యమెంతేని ఉంటుంది. అందుకే "And the first thing that we require of any novelist in his handling of characters is that, whether he keeps close to common experience or boldly experiments with the fantastic and the abnormal, his men and women shall move through his pages like living beings and like living beings remain in our memory after his book is laid aside and its details perhaps forgotten", అని చక్కగా పేర్కొన్నాడు హడ్సన్ పండితుడు.

అంటే నవలలోని పాత్రలు మనతోపాటు తిరిగే వ్యక్తుల్లాంటివై కదలికతో, జీవకళతో ఉండాలనీ, నవలను చదవడం పూర్తి చేశాక వాటి వివరాలు మరచినా ఆ పాత్రలు మాత్రం పాఠకుల మనఃఫలకాలపై చెరగని ముద్రవెయ్యాలని స్పష్టమౌతుంది. అంతేగాదు నవలా పాత్రలు గూర్చి E. M. Forster మరో రహస్యాన్ని వెల్లడించారు.

"They (characters) are people whose secret lives are visible; or might be visible; we are people whose secret lives are invisible."

మామూలు మానవుల అంతస్తత్త్వాలు తెలియవు. కాని నవలా పాత్రల స్వభావ వివరణ స్పష్టం చేయడమే నవలాకర్త చేయవలసిన పని. అంటే ఆయా సన్నివేశాలలో, సందర్భాలలో సముచిత రీతిని యితర పాత్రల సంభాషణా మూలకంగా లేదా

ఆయా పాత్రల చేష్టలవల్ల నవలా కారుడు మనః ప్రవృత్తిల్ని స్పష్టీకరించవలసి ఉంటుంది. అప్పుడే ఆ నవల ప్రసిద్ధికి రాగలదు.

వైవిధ్యంతో కూడిన పాత్రలు, వాటి చిత్త వృత్తులు చాలా చక్కగా మాలపల్లి నవలలో చిత్రీకరించి తెలుగులో ఉత్తమ నవలా కారుడుగా ప్రసిద్ధిగాంచిన వారు ఉన్నవవారు. రకరకాల వ్యక్తులు, రకరకాల చిత్త వృత్తులతో ఆనాటి సమాజాన్ని కన్నులకు కట్టినట్లు చిత్రించడం ఉన్నవవారి సొత్తు. ఇందులో ప్రధానంగా కనిపించేవి రెండు కుటుంబాలు. ఒకటి రామదాసు కుటుంబం రెండు చౌదరయ్య కుటుంబం. రామదాసు భార్య మాలక్ష్మి, రామదాసు పుత్రులలో మొదటివాడు వెంకటదాసు, రెండో వాడు సంగదాసు, మూడోవాడు రంగడు. కూతురు జ్యోతి, మేనల్లుడు అప్పాదాసు, సంగదాసు చౌదరయ్య యింట్లో జీతగాడు. చౌదరయ్య భార్య లక్ష్మమ్మ. వీరి ముద్దుల కుమారుడు రామానాయుడు, అతకంటే ముందు పెంచుకొన్నవాడు వెంకటయ్య, రామానాయుడు భార్య కమలమ్మ, వారి పుత్రుడు సాహు. (సహదేవ రావు). రామానాయుడు పినతల్లి కుమారుడు మోహనరావు. ఈ రెండు కుటుంబాల ననుసరించి అనేకానేక పాత్రలు నడయాడుతూ సందర్భోచితంగా తమ తమ ప్రాధాన్యాన్ని నిర్వర్తించుకుంటూ ఒక సమాజాన్ని మన కళ్ళ ఎదుట ప్రదర్శించి నవలలో విడదీయరాని బంధాన్ని కలిగి ఉండి నిజమైన జగత్తులా కనిపింప చేయటం వాటి విశిష్టత. అదే నవలకు గౌరవాన్ని తెచ్చిపెట్టింది.

పంచములు—అగ్రవర్ణులు; కూలీలు—జమీందారులు; కార్మికులు, ధనవంతులు; జీతగాడు—యజమాని; మామూలు ప్రజలు—మునసబు, కరణాలు, పోలీసులు, వకీళ్ళు, వకీలు గుమాస్తాలు, కోర్టు అధికారులు; సెటిల్మెంట్లు, సెటిల్మెంట్లలోని వ్యక్తులు, ఫాదరీలు, కాంట్రాక్టర్లు; ఖైదీలు—జైలు అధికారులు— ఇలాగ ఎందరో వ్యక్తులు, ఆ వ్యక్తుల్లోని ప్రేమ, వలపు, మోహం, ద్వేషం, దౌర్జన్యం, పగ, భక్తి, మధురభక్తి, అచలబోధ, దేశభక్తి మొదలైన భావాలతోపాటు పంచముల సముద్ధరణ, స్వరాజ్య సాధన, కార్మికులకు న్యాయం చేకూర్చాలన్న కోరిక ఒక ప్రక్క, ధర్మకన్నాలు—దోపిడీ, దానివల్ల వచ్చిన ధనాన్ని బీదలకు పంచిపెట్టే కోరిక మరో ప్రక్క, ఇలాంటి భావాలుగల పాత్రలు యిందులో ఉన్నాయి. ఈ పాత్రలన్నీ మనం రోజూ చూసే వ్యక్తుల్లాగే గోచరిస్తాయి. ఇది ఉన్నవవారి సజీవ పాత్ర చిత్రణకు గీటురాయి. ఆయా పాత్రల అంతస్తత్త్వాల్ని, యితర పాత్రలతో ఎలా భేదిస్తాయో నవలలో ప్రతియోగం (Contrast) మూలకంగా ఉన్నతవారు నిరూపించడం మనం గమనించ వచ్చు. ఒక్కొక్క చోట ఒక సన్నివేశంవల్లగాని, కొన్ని మాటలవల్లగాని ధ్వన్యాత్మ

కంగా ఆయా పాత్రల మనః ప్రవృత్తుల్ని స్పష్టీకరించడం మనం చూడవచ్చు. రచయిత తానై పాత్రల చిత్తవృత్తుల్ని చెప్పే పద్ధతికూడా యిందులో కన్పిస్తుంది.

నవలలో ప్రధాన పాత్ర రామదాసు. ఇతడు మాలదాసరి. ఈ నవల ఈ పాత్రతో ఆరంభమై, ఈ పాత్రతోనే ముగుస్తుంది. పంచముడైనా ఉత్తమగుణ ఖని రామదాసు. దయా సత్య శౌచాల ఆచరణ అతని ఊపిరి. శత్రువుకైనా అపకారం తలపెట్టనివాడు. శాంతిమార్గంలో పంచముల అభ్యున్నతి కోరినవాడు. పంచములేమేమి సర్వమానవాళి అభ్యున్నతిని ఆకాంక్షించినవాడు. వ్యక్తితః ఆస్తికుడు, వేదాల లోని సారం వారసత్వంగా అనేక కీర్తనల్లో, తత్వాల్లో ఉందని విశ్వసించినవాడు. భగవంతునిపై అచంచల విశ్వాసమున్నవాడు. తన ప్రియ పుత్రుడు సంగదాసు చౌదరయ్య దౌర్జన్యానికి, దౌష్ట్యానికి బలియైనా ఆ విషయం తెలిసికూడా చౌదరయ్యపై నింద మోపటాన్నిగాని, ప్రతీకారానికిగాని ఇచ్ఛగించనివాడు. గురువులన్నా, అచల బోధలన్నా అత్యంతాసక్తి గలవాడు. చౌదరయ్య మోసంచేసి తన యావదాస్తిని హరించినా అదే ప్రాప్తమని సమ్మినవాడు. తమ కుటుంబమీవిధంగా చితికి పోయి నప్పుడు ధనవంతుల దౌర్జన్యాన్ని సహించలేక ఊల్లు వదలి వెంకటదాసు వెళ్ళినా చలించనివాడు. తక్కెళ్ళ జగ్గడి పేరుతో వెంకటదాసు చేయిస్తున్న దోపిడీలతో సంబంధముందని సెటిల్మెంటుకు పంపబడినప్పుడు భార్యా పుత్రీ పుత్రులతో వెళ్ళడానికి వెనుదీయనివాడు రామదాసు. సెటిల్మెంట్ లో షావరీ, పౌలు చేసిన అవమానాల్ని, అఘాయిత్యాల్ని ఎదిరించిన ధీరుడు. అందుకు వ్యధ చెందిన పౌలు పన్నాగంతో కేసు మోపబడి మాలక్ష్మితోపాటు జైలుకు పంపబడినపుడు సంతోషంగా వెళ్ళిన సహనశీలి. జైల్లో ప్రవేశపెట్టేముందు జైలు అధికారులు దిగంబరునిగా చేయగా మొదట సిగ్గుపడ్డా, వెంటనే పసిబాలుని మనస్తత్వాన్ని ప్రసాదించమని దేవుని ప్రార్థించినవాడు. జైల్లో ప్రవేశించిన తర్వాత ఒకరాత్రి తోడి ఖైదీ కాముడనేవాడు దూరంనుంచి ఉమ్మేస్తే మొహమ్మీద పడగా కించిత్తు కోపం లేకుండా తుడుచుకొన్న మహాత్ముడు. జైల్లో తనను పెట్టే కష్టాలన్నీ ఎదుర్కొంటూ ఒకరోజు తనవంతురాగా నిండుగా ఉన్న మూత్ర పాత్రను నెత్తిన పెట్టుకొని మోస్తూ వెళుతూ ఉండగా తొణికి శరీర మంతా మూత్రంతో నిండిపోగా దాన్ని సైతం సహించగలిగిన వ్యక్తిత్వాన్ని సాధించిన సాధుశీలి. వెంకటదాసు పూర్వ చరిత్రతోపాటు, పౌలు అఘాయిత్యాన్ని ఎదిరించి కృష్ణానదిలోదూకి ఆత్మహత్య చేసికొన్న ప్రియపుత్రిక జ్యోతిమరణం, మేనల్లుడు అప్పాదాసు జ్యోతి శవంతో కృష్ణలోదూకి ప్రాణాలర్పించి సహగమనం చేయడం మొదలైన

విషయాలు వెంకటదాసు వల్ల విని తన పూర్వ కుటుంబస్థితి, ఈనాటిస్థితి స్ఫురణకు వచ్చి ఖేదిల్లాడు. తక్కెళ్ల జగ్గడనే మారుపేరుతో వెంకటదాసు ప్రభుత్వాన్ని ఎదిరించిన సందర్భంలో కాలూ చేయీ పోగొట్టుకొని క్షతగాత్రుడై తామున్న జైలులోకే కొనిరాబడగా అతనికి సేవచేయడానికై జైలు అధికారుల ఆదేశానుసారం మాలక్ష్మితో వెళ్ళినపుడు అతనిస్థితి జూచి మాతృహృదయం ద్రవించి భరించలేక మాలక్ష్మి మొదటి చూపుతోనే అసువులు కోల్పోతుంది. మేరునగధీరుడైన రామదాసు రోదించాడు. పుత్రుడు వెంకటదాసు దుస్థితికి వగచాడు. మిక్కిలి దుఃఖించినా, ధైర్యం కోల్పోని రామదాసు వెంకటదాసు మరణాన్ని జూచి అతని మరణ సమయంలోని మాటలవల్ల పుత్రవాత్సల్యాన్ని చవిచూచినా ఆనాటితో సర్వసంగపరిత్యాగి అయినట్లు నిర్ణయించుకొన్నాడు. మాలపల్లిలో ఉన్నా, సెటిల్మెంట్ లో ఉన్నా, జైల్లోఉన్నా సర్వమానవ శ్రేయస్సుకై పాటుబడిన మహానుభావుడు. తిలక్, గాంధి నాయకుల త్యాగంవల్ల స్వరాజ్యం సాధించబడిన సందర్భంలో జైలునుంచి విడుదలై మాలపల్లిలో రామానాయుడు వెంకటయ్యల త్యాగంవల్ల సంగదాసు సంకల్పానుసారంగా స్థాపించబడిన విజయ కళాశాల అనే గురుకులానికి మహర్షిగా మారిన రామదాసు కులపతిగా నియమించబడతాడు. మాలపల్లె మునిపల్లెగా మారిపోతుంది. ఈ పాత్రమూలంగా మానవధర్మ పరిణామాన్ని మిక్కిలి సున్నితంగా ప్రదర్శించారు ఉన్నవవారు పంచమోద్ధరణ, సర్వమానవాభ్యున్నతి, అహింస, అసహాయ యోగం, శత్రువుకి సైతం అపకారం తలపెట్టకపోవడం, కష్టసహిష్ణుత, దయాసత్యశౌచాలనే ఉత్తమ గుణాలను రామదాసులో వివిధ రీతుల చిత్రించి గాంధీమహాత్ముని మన కళ్ళఎదుట పెట్టారు ఉన్నవవారు. తమ నవలలో ఇది ధ్వన్యాత్మకంగా ప్రదర్శించి కృతకృత్యులైనట్లు స్పష్టం.

రామదాసు కుటుంబ యజమానిగా, భర్తగా, తండ్రిగా, ఒక పౌరునిగా తన బాధ్యతల్ని చక్కగా నిర్వర్తించినరీతిని స్పష్టంచేశారు రచయిత.

రామదాసు అనే నాణేనికి బొమ్మా బొరుసూ సంగదాసు, వెంకటదాసు. రామదాసులోని శాంతి, అహింసలకు ప్రతినిధి సంగదాసు. పీడితులు, తాడితులు అయిన అలగా జనాన్ని బాగుపరచాలన్న రామదాసు అంతరాంతరాల్లో అణిగివున్న కోరికను పరిపూర్తి చేసుకోడానికై ధనవంతుల్ని దోచైనా బీదలకు పంచిపెట్టాలన్న సత్సంకల్పానికి ఉత్తమ నాయకుడు వెంకటదాసు. సదాశయ సాధనకోసం శాంత్యహింసల మూలంగా సంగదాసు ఆత్మబలిదానం చెయ్యగా రక్తపాతం లేకుండా, హత్యలకు అవకాశమివ్వకుండా, స్త్రీజన సముదాయంపై అఘాయిత్యాల కవకాశమీయక.

అసమర్థుడైన దేవుడిపై విశ్వాసంలేక ధనవంతుల్ని దోచి ఎంతోమంది నిరుపేదల్ని బాగుచేయడానికై ఆత్మత్యాగం చేసినవాడు వెంకటదాసు. ఈ రెండు విభిన్న దృక్పథాలు రామదాసులోనే ఉన్నాయి. వాస్తవానికి అలాంటి వైవిధ్యాలు పాత్రల సృష్టి చేసిన ఉన్నవవారిలోనే ఉన్నాయి. మన మత సంప్రదాయాలు, భగవంతుడు మొదలైన వాటిపై అచంచల విశ్వాసం కలిగినవాడు సంగదాసు. వాటిని గౌరవిస్తూనే పంచములు అనే అంత్యజులు పైకి రావాలన్న కోరిక సంగదాసుది. ఇవన్నీకూడా అలగా జనాన్ని అణచివేయడానికై ఆదినుంచి ఆచరించిన అగ్రవర్ణాల అధర్మ వర్తనమనీ, వీటిని ఎదిరించాలనీ, వీటి కన్నింటికి మూలం కల్పితుడైన భగవంతుడనీ, ఒకవేళ ఉన్నా అసమర్థుడనీ అలాంటి అసమర్థుడైన భగవంతుడు లేకపోవడం మంచిదనీ నమ్మి వీటన్నింటిని ఎదిరించి అన్నత జనసందోహపు ఆనందానికి అవసరమైన ఆదికాలంనాటి స్వర్గాన్ని నిర్మించాలన్న కోరిక కలవాడు వెంకటదాసు. తల్లిదండ్రులే నిజమైన ప్రేమ పూరితమైన భగవత్స్వరూపులని విశ్వసించినవాడు వెంకటదాసు. ఈ విషయాన్ని మరణ సమయంలో స్పష్టం చేస్తాడు. ప్రభుత్వం, ధనవంతులు తన విధానాల్ని తిరస్కరించినా, విమర్శించినా నిరుపేదలు, మానవతా దృక్పథం గల ఒక కలెక్టరు చివరికి వీటినంగీకరించని తండ్రి రామదాసు, అతని వర్తన విచిత్రమైందనే మెచ్చుకోవడంలో వెంకటదాసు మానవతావాదం అంటే ఉన్నవవారి మానవతావాదం విశదమౌతుంది. కూలీలు, కార్మికులు మొదలైన శ్రమజీవుల్ని దోస్తున్న జమీందారుల ధనవంతుల అగడాల్ని అరికట్టడానికై సమ్మెలు కట్టించడంలో నైతేనేమి, పంచముల సమావేశంలో ప్రధాన పాత్ర వహించడంలోనైతేనేమి, అగ్రవర్ణంలోని వ్యక్తుల్ని ప్రధానంగా రామానాయుడ్ని తనవైపు, తన ఉద్యమంవైపు సానుభూతి చూపించేట్లు చేసుకోవడంలోనైతేనేమి కృతకృత్యుడై చౌదరయ్య దౌర్జన్యానికి ఆత్మబలిదానం చేసిన మహాగాంధేయవాది, మానవతా వాది సంగదాసు. ప్రేమభక్తి అంటే మధుర భక్తియందు విశ్వాసంకలిగి రామానాయునిలో కృష్ణపరమాత్మునిగాంచి తాను గోపికయై, తాను మురిసిపోయి ఆనంద పరవశుడైన వాడు సంగదాసు. చౌదరయ్య యింటిలో జీతగాడైనా తన ఉత్తమ ప్రవర్తనతో యజమానికంటె ఎక్కువ గౌరవాన్ని సంపాదించిన వాడు. చౌదరయ్యకు కూడా అతనియెడ అమితమైన విశ్వాసముంది. కాని కూలీలు సమ్మెకట్టడానికి, పుత్రుడు రామానాయుడు పంచమోద్యమంలో చేరి చెడిపోవడానికి సంగదాసే కారణమని నమ్మి వీటన్నింటికి అంతం సంగదాసు అంతమేనని నిర్ణయించుకొన్న చౌదరయ్య కోపాగ్నిలో శలభమై కాలిపోయిన మహాత్యాగధనుడు సంగదాసు. సంగదాసు మరణానంతరమే జీవివచడం ఆరంభించాడన్న పూర్వోక్త విషయం అక్షర సత్యం.

చౌదరయ్య నవలలో ప్రతినాయకుడు. ఆనాటి జమీందారులలోని దౌర్జన్యానికి, దౌష్ట్యానికి, మోసం, దగాలకు, ధనాకాంక్షకు చక్కటి రూపకల్పన చౌదరయ్య. అయినా పుత్రప్రేమ, మనవడిపై వాత్సల్యం, భార్య మరణంతో సంచలించి పోవడం, చివరలో తాను గావించిన దుష్కార్యాలకు పశ్చాత్తప్తుడు కావడం మొదలైన గుణాలు కూడా మానవ సహజరీతిని ఈ చౌదరయ్య పాత్రలో చిత్రించబడ్డాయి. ఈ పాత్రకు ప్రతియోగ (Contrast) రీతిని అతని పుత్రుడు రామానాయుడ్ని ప్రవేశపెట్టి ఉన్నవవారు చౌదరయ్య దౌష్ట్యాన్ని, రామానాయుడి సుగుణ సంపత్తిని ధ్వన్యాత్మకంగా స్పష్టం చేశారు. రామానాయుడు మితభాషి. తల్లిదండ్రుల యెడ భయభక్తులు కలిగిన ప్రియపుత్రుడు. శ్రీరామునివంటి ఆదర్శవంతుడు. ఏకపత్నీవ్రతుడు. "కమలమ్మా సాహుకు ఆజన్మాంతము అపకీర్తి వస్తుందనైనా యోచించావు కావుగదా" అని మాత్రం అంటాడు మోహనరావుతో లేచిపోయిన కమలమ్మను గూర్చి. శాంతమ్మ అన్న మారుపేరుతో తమ యింటిలోనే వంటమనిషిగా కుదిరి సాహూ మరణంతో తన పాదాలమీద పడి మరణించిన కమల తన కమలేనా ? అని ఆశ్చర్యచకితుడై క్షమించిన ఉత్తముడు. పంచముడైనా సంగదాసు యెడ ప్రగాఢ మైత్రి పెంపొందించుకొన్నవాడు. తమ మైత్రికి చిహ్నంగా "నన్ను మరచిపోకు, మనమే గెలుస్తాం," అన్న సంగదాసు మాటలు తన్ను కలవర పరుస్తుండగా పంచమోద్యమం కార్మికోద్యమాలకు అంకితమై సంగదాసు ఆకాంక్షించిన విజయ కళాశాలను చౌదరయ్య మరణానంతరం యావదాస్తిని సద్వినియోగం చేస్తూ మాలపల్లిలో నిర్మించిన మహాత్యాగధనుడు. ఇందుకు చేదోడు వాదోడుగా నిల్చిన ధర్మపరుడు అన్న వెంకటయ్య. మాలపల్లెను మునిపల్లెగా మార్చిన ఘనత రామానాయుడిది.

అమలిన శృంగార మొకవైపు, మోహ శృంగారం మరోవైపు ఈ కథలో అంతర్లీనంగా ప్రవేశపెట్టి వాటికి ప్రతినిధులుగా రెండుజంటల పాత్రలని సృజించారు ఉన్నవవారు. తల్లిదండ్రులు పెళ్ళి విషయమై ప్రస్తావిస్తే జ్యోతి, అప్పాదాసులు అంగీకరించరు. శారీరక సంబంధంకంటే ఉదాత్తమైన ప్రేమానురాగాలు, మమతా మమకారాలు అమలినమేకాదు; అమరం కూడా అని విశ్వసించి నిరూపించిన వారే జ్యోతి అప్పాదాసులు. తమ జీవితాలను సైతం అమరం చేసుకొన్న జంట యిది. క్షణిక సుఖాలకోసమై పండంటి కాపురాన్ని పాడుచేసుకున్న వ్యామోహితమైన మగనాలు కమలమ్మ. మొదటి చూపులోనే ఆకర్షితుడై లేవదీసుకొనిపోయి చక్కటి సంసారంలో చిచ్చుపెట్టి అమ్మ అన్నల ప్రోద్బలంతో మరో పెళ్ళి చేసుకొన్నా తాను

చేసిన ద్రోహానికి నిష్కృతి లేక తహతహలాడి తపించి సబర్మతి చేరినా శాంతిని పొందలేక క్షయవ్యాధికి లోనై తన ద్రోహాన్ని క్షమించమని రామానాయుడ్ని అడగడానికి తనకు అర్హత లేదని తలంచి తన పాపానికి ప్రాయశ్చిత్తంగా తన ఆస్తినంతటిని విజయ కళాశాలకు వినియోగించ వలసిందని వీలునామా వ్రాసి రామానాయుడికి పంపి పాప పరిహారం చేసుకొన్నవాడు మోహనరావు ఇంటి గౌరవాన్ని, భర్తృ ప్రేమని, పుత్రవాత్సల్యాన్ని వదలిపెట్టి లేచిపోయిన ఫలితంగా ఘోరమైన స్ఫోటకానికి గురియై తనవాళ్ళే గుర్తుపట్టలేనంతగా మారిపోయి శిక్షననుభవించిన కమలమ్మ పాత్రను రచయిత చక్కగా చిత్రించి పాఠకుల సానుభూతికి అర్హురాలిని గావించడం విశేషం. తెలుగు నవలల్లో మగనాలు లేచిపోయే చిత్రణకి యిదే మొదలు. ఈ జంట చేసిన అకృత్యానికి తగిన శాస్తిననుభవించినట్లు చిత్రించి, చక్కని నీతిని ఉపదేశం చేసి మోహ శృంగారం వలన కలిగిన దుష్ఫలితాల్ని స్పష్టం చేశారు రచయిత.

ఉన్నవవారి స్త్రీ పాత్రల గురించి ప్రత్యేకంగా ఒక సిద్ధాంత వ్యాసమే రాయవచ్చు. రకరకాల స్త్రీలు, వాళ్ళ మనః ప్రవృత్తులు, లోక సహజరీతిని వర్ణించి తరించారు ఉన్నవవారు. చౌదరయ్య భార్య లక్ష్మమ్మ, రామానాయుడు భార్య కమలమ్మ. కమలమ్మ తల్లి అనంతమ్మ. కమలమ్మ చిన్ననాటి సాహసగత్తె లింగ బలిజ కోటమ్మ, రామదాసు భార్య మాలక్ష్మి; రామదాసు కూతురు జ్యోతి; తొగట కోటమ్మ రామదాసు అక్క, సుబ్బలక్ష్మి, ముతరాచు ముసలిది, పుల్లప్ప భార్య, తల్లి మొదలైన స్త్రీ పాత్రల్ని స్త్రీ సహజరీతిని ఆయా సన్నివేశాలలో సందర్భోచితంగా చిత్రించి ఉన్నవవారు ఉత్తమ రచయితగా నిరూపించుకొన్నారు.

అప్రధాన పాత్రలను గురించి కూడా మనమీసందర్భంలో చెప్పుకోవడం సముచితం. పసిపిల్లవాడి హృదయం సాహు పాత్ర ద్వారాను, సెంటిల్మెంట్లలో, జైళ్ళలో అనేక వ్యక్తుల్లో ప్రధానంగా పుల్లప్ప, కామానాయుడు మొదలైన అప్రధాన పాత్రల (Minor characters) ప్రాధాన్యాన్ని చిత్రించడం గమనించవచ్చు.

ఇలాంటి వైవిధ్యంతో కూడిన సజీవ పాత్ర చిత్రణ ఉన్నవవారు చెయ్యడం మూలాన్నే మాలపల్లి ఈ నాటికీ నిలిచివుంది. ఏనాటికీ నిలిచివుంటుంది ఇతివృత్త స్వీకరణంలో, కథాకథనంలో, సన్నివేశ కల్పనలో, సంఘటనలు సమకూర్చ

దంలో, పాత్రల్ని చిత్రించడంలో, సంభాషణాచాతుర్యంలో తమ ప్రతిభా, ప్రావీణ్యాన్ని ప్రకటించి తెలుగులో ఉత్తమ నవలాకారుడుగా ప్రసిద్ధికెక్కారు ఉన్నవవారు.

గాంధీజీ ప్రభావం

పంచముల అభ్యున్నతి అనే ప్రధానాశయంతో ఉన్నవవారు గాంధీ దృక్పథంలో నడచి నవలా రచనలోను సఫలీకృత మనోరథులయ్యారనడం సత్యం. "దేశానికి రాజకీయంగా విముక్తి కలిగించడమొక్కటే కాదు మహాత్ముని ధ్యేయం. సమాజంలో ఆర్థికమైన సమానత్వాన్ని నెలకొల్పి, మానవులందరు సోదరులు అనే భావాన్ని నిత్య జీవనంలో సాధించడమే ఆయన ఆదర్శం. అది కేవలం సామూహికమైన ఉద్యమంగానే కాదు. వ్యక్తిగా మానవునిలో వచ్చే మార్పుకూడా సాధించవలసిన ఆదర్శం. మానవధర్మ పరిణామం బహిరంతరాల్లో రెండు విధాలా జరుగవలసిందే. సంఘ సంస్కరణ, రాజకీయమైన విప్లవము సాధించగలిగినవి పరిస్థితులలో మార్పు; నైతికంగా, ఆధ్యాత్మికంగా వ్యక్తి దృక్పథంలో రావలసినదేమో ఆంతరంగికమైన మార్పు. ఈ రెండింటిలో దేన్ని ఉపేక్షించినా ఆశయసిద్ధి కలుగదు. రెండింటిమీదా దృష్టి నిలిపి దారి చూపడమే గాంధీజీ విశిష్టత," అని గాంధీజీ ఆదర్శాన్ని, దాని విశిష్టతనీ తెలిపి "సంప్రదాయంలోని మేలు కీళ్ళని విచక్షించి, వ్యక్తికీ సమాజానికీ గల సంబంధాన్ని అవగాహన చేసుకొని నిత్య నూతనమైన జీవన స్వరూపాన్ని ఆశించిన మానవ ధర్మ పరిణామానికి తగినట్లుగా దిద్ది తీర్చే దృక్పథం మాలపల్లి నవలలో కనిపిస్తుంది. గాంధీగారి దృక్పథానికి దర్పణమే మాలపల్లి నవల." అంటూ చక్కగా వివరించారు ఆర్. యస్. సుదర్శనం గారు.

ఆయా సందర్భాల్లో ప్రసక్తాను ప్రసక్తంగా ఇతివృత్తంలో, పాత్ర చిత్రణలో ఉన్నవవారు గాంధీజీ ప్రభావానికి లోనై అతని ఆదర్శాన్ని ఎలా ప్రస్ఫుటం చేశారో వివరించాను. రామదాసు మూర్తీభవించిన... రామదాసు మూర్త్తులా గాంధీజీయే. సంగదాసు పంచమోద్యమంలో, కూలీల, కార్మికుల, అణగారిన జనుల అభ్యున్నతికై పాటుపడుతూ ప్రాణాలర్పించడంలోను గాంధీ దృక్పథం స్పష్టం. ఈ రెండు పాత్రలద్వారా గాంధీ దృక్పథాన్ని ఉన్నవవారు స్పష్టం చేశారు. రామదాసు ఉత్తమ వ్యక్తిత్వానికి లోనై సెటిల్మెంటులో, జైలులో ఎంతోమంది సన్మార్గ వర్తనలు కావడమే కాదు,

రామదాసు కుటుంబం చితికి పోవడానికి చౌదరయ్యకు సాధనంగా ఉపకరించిన జిత్తులమారి పంతులు చివరికి సన్మార్గ వర్తనుడు కావడం విశేషం. మాలపల్లి మునిపల్లెగా మారడం, విజయ కళాశాల స్థాపనతో సంగవిజయం కావడంలో గాంధీ దృక్పథం స్పష్టమౌతుంది.

"ఇన్ని కారణాలవల్ల యీ నవల (మాలపల్లి) తెలుగులోని గాంధేయ సాహిత్యంలో మణిపూస అనిపించుకొన్నది. కాని ఇంత ఉత్కృష్టమైన గాంధేయ రచనలో ఎక్కడా గాంధీజీ పేరైనా ఉటంకించబడలేదు. అందువల్ల దీని ఆధిక్యత యినుమడించింది." అని మొదలి నాగభూషణ శర్మగారు అన్నారు. కానీ గాంధీజీ పేరు నవలలో అనేక పర్యాయాలు ఉటంకించబడి ఉంది, గాంధీ దృక్పథం నవల అంతటా ధ్వన్యాత్మకంగా చిత్రితమై ఉండడమే గాదు, సుమారు పన్నెండు పదమూడు మార్లు గాంధీజీ నామం నవలలో స్పష్టంగా పేర్కొనబడి ఉండడం గమనించగలం సూక్ష్మంగా పరిశీలిస్తే.

## సాంస్కృతిక వారసత్వం

గాంధీజీ దృక్పథానికి అనుగుణమైన సాంస్కృతిక వారసత్వాన్ని సైతం చక్కగా ధ్వన్యాత్మకంగా నవలలో ఉన్నవవారు పొందుపరచడం మరో విశేషం. ఈ సాంస్కృతిక వారసత్వాన్ని రెండు విధాలుగా వివరించారు. ఇతివృత్తంలో, పాత్రల్లో ఇది స్పష్టమవుతుంది. వేదవిద్య, వేదవిజ్ఞానం, భక్తి, మొదలైనవన్నీ అగ్రవర్ణాల సొత్తని విర్రవీగవలసిన పని లేదంటూ సామాన్యజనుల వాడుకలోని తత్వాల్లో, కీర్తనల్లో ఇవన్నీ యిమిడివుండి తక్కువ కులాలవారికి సైతం సంక్రమించాయన్న విషయాన్ని అనేకరీతుల రామదాసు, సంగదాసు, బుచ్చయ్య మొదలైన వారి మతచర్చలో, అచల బోధలో ప్రేమ భక్తి తత్వంలో వివరించారు ఉన్నవవారు. అందుకే "ఆర్య విజ్ఞానం అందరి సొమ్ము" (మాలపల్లి-పు168-173) అని స్పష్టం చేశారు. ఇది అనాదినుంచి అనుస్యూతంగా వస్తూన్న పరిణామ రీతి అని తెలుస్తుంది. చదువు వేరు సంస్కారం వేరు. రామదాసు కుటుంబం మాలదాసరి కుటుంబానికి చెందింది. రామదాసుగాని, అతనీ కుటుంబసభ్యులు గాని పెద్ద చదువులు చదివినవారు కారు. కానీ తండ్రివల్ల సంతానం వారసత్వంగా ఈ విజ్ఞానాన్ని పొందుతున్నట్లు, మానవ ధర్మ పరిణామరీతిని స్పష్టం గావించడం చూడగలం. మత చర్చలో, భగవంతుని ఉనికిని గూర్చిన విషయంలో రామదాసుతో పాటు సంగదాసు, జ్యోతి చివరికి అతని మేనల్లుడు అప్పాదాసు హేతు

బద్ధంగా మాట్లాడటం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. వెంకటదాసు వీళ్ళందరితో అంగీకరించక పోయినా వాటిని ఖండించడంలో తన వాదాన్ని స్థాపించడానికి యత్నించడంలో ఈ వారసత్వం గోచరిస్తుంది. ఈ విషయాన్ని కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు "సంస్కృత పాండిత్యము దేశ్య పాండిత్య పరిణామ మును పొందినది. సంస్కృత వేదాంత సూత్రములు తెలుగు కీర్తనల పరిణా మమును పొందినవి. వైదిక కర్మకాండ, వేదాంత భక్తి పరిణామమును పొంది నది. రామానుజ, బసవేశ్వరాదుల భక్తిమార్గము ప్రజాజీవనమందు లీనమైనది. భక్తులన్ని కులములందును ప్రపత్తిని బడసిరి. వేదాంత విజ్ఞాన మన్నికులముల వారికిని సమాన స్వత్వమైనది. రాజులు మారినను రాజ్యములు పోయినను, మతములంతరించినను, గ్రామసీమలందు ప్రజాసాహిత్య జీవనము నిమ్నోన్నతము లకు పాలైనను వికాసవంతమగుచున్న విధమును "మాలపల్లి" సరసముగ వర్ణించు చున్నది," అని చక్కగా విశ్లేషణ గావించారు. ఇలాగా సాంస్కృతిక వార సత్వం అనేక రీతుల మాలపల్లిలో స్పష్టమవుతుంది.

## భాష - శైలి

తెలుగు నవలల్లో వాడుకభాషను ప్రయోగించిన మొదటి పెద్దనవల మాలపల్లి. ఇందులో ఉన్నవ వారు ప్రధానంగా గుంటూరు మండలంలోని మెట్ట ప్రాంతానికి సంబంధించిన మాండలికాన్ని ఉపయోగించారు. వాస్తవానికి యిందులో అనేక మండలికాలున్నా మెట్టప్రాంతానికి చెందిన మాండలికమే ప్రాధాన్యం వహి స్తుంది. ఏవో కొన్నితప్ప ఈ మాండలిక పదాలు పాఠకుని అర్థావగతికి అవరోధాలు కావు. ఇది దీనిలోవున్న ప్రత్యేక విశిష్టత. ఆనాడు సామాన్యప్రజల వాడుకలోఉన్న భాషనే ఉన్నవవారు ప్రయోగించారు. సామాన్య ప్రజలలో తానొకడై సదవగాహన చేసికొన్న రచయిత గనుకనే అలాంటి వాడుకభాషని ప్రయోగించగలిగారు. తమ రచన అందరికీ అందుబాటులో ఉండాలన్నదే వారి ఆకాంక్ష. కేవలం పండితుల్ని ఆనందింపజేయడానికైతే గ్రాంధికంలో వ్రాసిఉండేవారు. పామర ప్రజల్లో చైతన్యం తీసుకరావడమే తమ ధ్యేయం. అందుకే వాడుకభాషని వాడుకచేశారు. చక్కటి తెలుగుపలుకు బళ్ళు, సందర్భోచితమైన సామెతలు, తమ వాడుక భాషకు నిండు దనాన్ని సంతరింపజేశాయి. ఇది వాడుకభాష గనుక వ్యాకరణానికి ఒదగని వైరి సమాసాలెన్నో ఉన్నాయి. వాటిని స్పష్టార్థతకొరకే ప్రయోగం చేశారుగాని మరింత క్లిష్టతకోసం వాడలేదు. ఆనాటి వాడుకలోని ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ మొదలైన అనేక దేశ్యేతర పదాలు ప్రయోగం చేయడంకూడా వారికి భాషమీదగల అధికారాన్ని

స్పష్టం చేస్తుంది. మాలపల్లి నవలలోని ఆనాటి గుంటూరు మాండలికాల్లో చాలావరకు ఈనాటికీ రాయలసీమలో వాడుకలో ఉన్నాయి. అంటే పూర్వపూర్వం మన తెలుగు భాష తెలుగు నాడంతటా సమానంగా ఉండివుండవచ్చుననడానికి అవకాశముంది. అలాంటి వాడుకలు కొన్ని ఈనాడు గుంటూరు మండలంలో లుప్తమయ్యాయంటే ఆశ్చర్యంలేదు. ఆధునిక కాలంలో అత్యధికంగా పరిణామం చెందడమే దీనికి కారణం.

ఉన్నవ వారి భాషా, శైలి అన్నిచోట్ల ఒకేపద్ధతిలోనుండవు. సందర్భోచితంగా పలువిధాలుగా ఉంటుంది. జొన్నచేను వర్ణించేభాషకి, ఉదయసంధ్యలో మాలపల్లి వర్ణించే భాషకి, వ్యక్తివర్ణన, దేవాలయ వర్ణనచేసే భాషకి, మతం, ప్రేమ భక్తి, ప్రేమ, మోహం, శృంగారం మొదలైనవాటి వర్ణనలో ప్రయోగించిన భాషకి, సామాన్య సంభాషణల్లో వాడిన భాషకి, రకరకాల స్త్రీలు మాట్లాడే భాషకి తేడాలుండి ఉన్నవ వారి శైలీవిన్యాసం సందర్భోచితమై, రసభావాల కనుగుణంగా చక్కగా కొనసాగి ఇంతపెద్ద నవలలో మూర్తి కట్టినట్లు స్పష్టమౌతూంది. భాషలో, శైలిలో యిలాంటి వైవిధ్యం లేకపోతే పాఠకుల మనస్సుల్ని ఆకట్టుకొని ఆనందింపజేసి ఉండేవికావు. చిన్నపిల్లల భాషకి, సాయబుల భాషకి, పాదరీల భాషకి, మామూలు తెలుగువాళ్ళ వాడుకభాషకిగల తేడాలన్నీ ఈ నవలలో మనం చూడవచ్చు. మాలపల్లి నవలలోని భాషపై, శైలిపై పరిశోధన జరగవలసిన అవసరం ఎంతైనా ఉంది.

విమర్శలు

ఇంత చక్కటి నవలపై కొన్ని విమర్శలు రావడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఇందులోని రామానాయుడుభార్య కమల భర్తను, పుత్రుడు సాహూను వదలిపెట్టి మోహనరావుతో లేచిపోయి తరువాత విరూపయైవచ్చి చౌదరయ్య యింట్లో పనికత్తెగా కుదిరి సాహూసేవలో ఉండి వాడి మరణంతో భర్తృక్షమాభిక్షను అర్థించి మరణిస్తుంది. సమంగా యిలాంటిదే ఆంగ్లంలో మిసెస్ హెన్రీవుడ్ రచించిన "ఈస్ట్ లిన్" కథ. ఈ కథాప్రభావం దీనిపై ఉన్నట్లు వివరించారు డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారు మరి ఉన్నవ వారు ఈస్ట్‌లిన్ కథ చదివివున్నారేమో మనకు తెలియదు. అయినా ఈ కథ పెద్దదైన మాలపల్లి నవలలో ఇమిడిపోయి స్వతంత్ర రచనలాగే ఉంది.

ఇందులో కమ్యూనిజం లేదంటూ తక్కెళ్ళ జగ్గడు చేస్తున్న "ధర్మ కన్నాలు రాబిన్‌హుడ్‌ను జ్ఞాపకంచేస్తాయిగాని కమ్యూనిస్టును కాదు, ఆదికాలంనాటి సౌభ్రాత్ర, సమానత్వాలు అచ్చుకు మచ్చుగా కమ్యూనిజానికి నప్పవు," అని కే. వి. రమణారెడ్డి గారి వాదం. వెంకటదాసు పాత్రద్వారా యథాతథంగా కమ్యూనిజాన్ని ప్రవేశపెట్టారు.

ఉన్నవ వారు అనడం కుదరకపోవచ్చు. కాని కమ్యూనిజానికి సంబంధించిన అవగాహనమాత్రం ఉన్నవవారికుంది. అందుకే సంప్రదాయాలపై తిరుగుబాటు, ధనవంతులదోపిడీ, దానివలన సంపాదించిన ధనం బీదలకు పంచిపెట్టడం, దేవుడిపై విశ్వాసం లేకపోవడం మొదలైన లక్షణాల్ని వెంకటదాసు పాత్రలో నిరూపించిన ఉన్నవ వారికి ఆ అవగాహన ఉందని చెప్పవచ్చు. చివరికి రామదాసుచేత సైతం "నీది చాలా కొత్తనాటకం. నీ నాటక నియమాలుకూడా వేరే. కొత్తపంథా తొక్కావు. నేను మామూలుదారిని పోయినవాణ్ణి. నీది మార్గంకాదని చెప్పలేనుగాని అంతా అవలంబిస్తే ఎట్లా ఉంటుందో చూడాలె. నీ మార్గం నియమబద్ధంమటుకు అవును. ఆ నియమములు చాలా ఉత్కృష్టమైనవని, అమలులో పెట్టడము కష్టమేమోనని చాలామందికి అనుమానం," అని అనిపించడంలో యిది స్పష్టమౌతుంది.

మాలపల్లి నవలలో నాలుగోభాగం తర్వాత ఎప్పుడో రాశారని, అందువల్లనే అతికించినట్లుగా ఉందని ఒక వాదం. ఇది సముచితంకాదు. పూర్తినవల జైల్లోనే రచించినట్లు ఖచ్చితమైన సాక్ష్యముంది.

రామదాసు జైలుజీవిత విపుల వర్ణన పాఠకునికి విసుగు కల్గిస్తుంది, కథా గమనానికి అడ్డంకి అవుతుందని మరో వాదం. కాని ఈ విపుల వర్ణన లేకపోతే రామదాసు పాత్రోన్మీలన సార్థక్యం వహించిఉండేది కాదు. ఆ పాత్ర క్రమ పరిణతికి యిది ఉపకరించింది.

నవలలోని చివరి భాగంలో 16, 17, 18 ప్రకరణాలలో స్వరాజ్యం వచ్చినట్లు చిత్రించడంకూడా సముచితం కాదని ఇంకో వాదం. కానీ 1922 లో జైలులో ఉంటూ ఉన్నవ వారు 1947 లో వచ్చే స్వరాజ్యాన్ని భావించిన ఉత్తమ ప్రతిభా సంపన్నులు.

"ఏ ఒక్కసమస్యా కథావస్తువుకాదు. ఆంధ్రదేశాన్ని ఈనాడు బాధిస్తూన్న సమస్యలన్నీకూడా మాలపల్లికి కథావస్తువులే.

"ఇన్ని మాటలెందుకు పంతులుగారి మాలపల్లి ఒక చిన్న ఎత్తున ఆంధ్రదేశ ప్రత్యక్ష జగత్తు" అన్నారు శ్రీనివాస శిరోమణిగారు.

ఇలాంటి ఉన్నవ వారి ఉత్తమమైన మాలపల్లి నవలను వారి శత జయంత్యుత్సవాల సందర్భంగా తెలుగువారికందరికీ చౌకధరకందించి మళ్ళీమళ్ళీ చదివేట్టు చేసి తన్మూలకంగా ఉన్నవవారి సదాశయాల్ని సదవగాహనచేసుకొనే అవకాశం కల్పించే బాధ్యతని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ స్వీకరిస్తుందని ఆశిస్తున్నాను.

